Approved by the Text book committee,
Vide Ft. St. George Gazettee Page 247 Dated 12-4-32.

శ్రీ
పట్టనాయక గ్రంథమాల
ప్రథమకుసుమము.

# చక్రపాణి.

(నిరూపక నవల)



మూడవకూర్పు



చెలికాని సత్యనారాయణ,
(కవితాసమితి.)

1937. వెల 8 అణాలు.

# పద్మనాయక గ్రంథమాల.



ఇందు సమర్థులగువారిచే రచియింపబడిన నవలలు, నా ములు, భావగర్భితములగు ఖండకావ్యములు అవకాశమును ప్రకటించుచుందుము. చందాదారులకు వెల స్వల్పమ మాత్రముండును.

## చందావివరము.

| | | | |
|---|---|---|---|
| ప్రధాన రాజపోషకులు విరాళరూపముగా | | | రు 250 |
| రాజపోషకులు | ... | ... | రు 100 |
| పోషకులు | ... | ... | రు 50 |
| అభిమానులు | ... | ... | రు 25 |

చందాదారులు:— గ్రంథమాలనుండి వెలువ
గ్రంథములు పుచ్చుకొనువార



శ్రీ

పద్మనాయక గ్రంథమాల
ప్రథమ కుసుమము.

# చక్రపాణి.

(నిరూపక నవల)



మూడవకూర్పు 1000 ప్రతులు.

చెలికాని సత్యనారాయణ,
(కవితాసమితి.)



[వెల 8 అణాలు.

# ప్రధాన రాజ పోషకులు.

మహారాజశ్రీ శ్రీ రాజాసాహెబ్ మెహర్బాన్, దోస్తాన్, శ్రీ రాజా రావు వెంకట శ్వేతాచలపతి రామకృష్ణ రంగారావు బహద్దర్ శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి సంస్థానాధీశులు.

మహారాజశ్రీ శ్రీ శ్రీ రాజా రావు రామకృష్ణ రంగారావు బహద్దర్ శ్రీ శ్రీ కిర్లంపూడి సంస్థానాధీశులు.

---

## పోషకులు.

మహారాజశ్రీ శ్రీ యినుగంటి భుజంగరావుగారు, బొబ్బిలి.

---

## అభిమానులు.

మహారాజశ్రీ చెలికాని శ్రీరంగనాయకులుగారు, బి.ఏ., బి.ఎల్.,

రాజాం.

# విన్నపము.

నా ఆంధ్ర సోదరుల ఆదరాభిమానములచే అచిర కాలముననే యీ చిన్ననవల రెండవకూర్పు ప్రతులుకూడ పూర్తిగా చెల్లిపోయినవి. తిరిగి యీపుస్తకము ముద్రించు ఆవశ్యకత గలిగినందులకు నాకృతజ్ఞతాభివందనము లర్పించు చున్నాడను.

పెంటనాగులవలస,
1-1-1937.

చె. స. నా.,
గ్రంథకర్త.



ఓం.

శ్రీరామ

# చక్రపాణి.

## మొదటి ప్రకరణము.

"దాసూ! మనంవచ్చి నెలరోజులయింది కాని— ముండాకొడుకు నాఖరికి పట్టుకున్నామోయి! చాలాదూరం నుంచి యింత గొప్పపట్నం వచ్చి తుదకు జయంతో యింటికి పోతున్నందుకు చాలా సంతోషంగావుంది సుమా!"

"సంతోషంగావుందని నెమ్మదిగా అంటున్నావేమిటి? పరమసంతోషంగావుంది. విశ్వనాథం! నీ పేరుకు తగినట్లు బుద్ధి చూపించావోయి!"

"ఇందులో పేరుమాత్రం మందేకాని కష్టమంతా కొండడిదే! ముండావాడు మనల్ని మించినపని చేసేడు! ఏమంటావ్?"

"అవును! నాడెలాంటివాని చేతికింద తయారవుతున్నాడేమిటి? మేటి ప్రఖ్యాతిగాంచిన అపరాధ పరిశోధకాగ్రగణ్యుఁడగు విశ్వనాథం నౌఖరు."

"అబ్బో! కవిత్వం ఆరంభించావేమిటి? పోనీ యీ భటాగ్రిజు పొగడ్తల కేంగాని వేగిరం టీ తాగుదాం రా! అల్లా తిరిగొచ్చి మూడుగంటల బండిమీద యింటికి పోదాం!"

పై విధమున సంభాషించుకొనుచున్న యిరువురును మా పాఠకులకుఁ గొ్రత్తవారుకారు. శ్రీయుత చింతాశంకర దీక్షితులవారి యపరాధపరిశోధక నవలలను చదివినవారికి చిరకాల పరిచయులై యున్నారు.

విశ్వనాధ మపరాధులను పరిశోధించి పట్టుకొనుటయందు గొప్ప పేరును సంపాదించి ప్రభుత్వమువారిచే మిక్కిలి గౌరవింపఁబడుచు ననేక సమయములందు విలువగల బహుమానములను పొందియుండెను. నిరంతరము ప్రభుత్వోద్యోగులును స్నేహితులును విశ్వనాధముతో రక్షకభటశాఖయందే దేని యుద్యోగమునఁ బ్రవేశించుమని బలవంతపెట్టుచుండిరి. కాని సేవకావృత్తి యందున్న హేయభావముచేతనో లేక వత్సరమునకు భూములవలనఁ దనకు వచ్చు పదునేనువందల రూప్యములు తన యిచ్చవచ్చినట్లు వెచ్చఁబెట్టుచు స్వేచ్ఛగా విహరించుచు నిరపరాధులను రక్షించుటయందును అపరాధులను దండించుటయందును తనకున్న మేధాశక్తి నంతయు పరోపకారార్థమే వినియోగించుట సమంజసమనిదలంచియో ఉద్యోగమునందు తనకున్న నిరసన భావమును మిత్రులకు స్పష్టముగ నెల్లడించెను. అందువలన విశ్వనాధము మఱింత గౌరవాస్పదుడగుటకు కారణమయ్యెను.

నారాయణదాసు విశ్వనాధమునకు మేనత్తకుమారుఁడు. అతఁడు నిరుద్యోగశాఖలో నధ్యక్షత వహింపఁగల సమర్థుఁడగుటచే జన్మస్థలమగు రాజమహేంద్రవరమును విడిచి సంవత్సరమునకుఁ దొమ్మిదిమాసములు విశ్వనాధము దగ్గఱనే కాలక్షేపముచేయు వాడుకయైయున్నది.

విశ్వనాధము కాపురము విశాఖపట్టణ మయినను ప్రస్తుతము మన కథాకాలమునాటికి కొన్ని యత్యవసరకార్యములపై గలకత్తానగరమున నుండవలసివచ్చెను.

ఒక హత్యావిషయమగు నేరములో ప్రభుత్వమువారి కోరికపయిని కలకత్తాకుఁబోయి నేరస్థుల ననేక శ్రమలకోర్చి పట్టుకొని యీదినముననె స్వగ్రామోన్ముఖుఁడగుటకు సిద్ధముగ నుండెను. టీ త్రాగుటైనది. "మార్నింగుపేపరు తర్వాత చూదాం" అనుచు బల్లపైనున్న వార్తాపత్రికను చేతితో నెత్తి మరల నచ్చటనే పడవైచి గోడకుఁ దగిలించియున్న కోటును ధరించుచు "దాసూ! వేసుకోవోయి! కోటు" అనుచు విశ్వనాధము ముందునకు పదడుగులు వైచెను.

ఇంతలో వీధితలుపు ఒక్కమని చప్పుడయ్యెను. తోడనే బెదరుచూపులతో కాళ్ళుతడఁబడ గడగడ వడకుచు యిరువదేండ్ల యువకుఁడొకఁడు విశ్వనాధమున కెదురుగావచ్చి రెండుకాళ్ళనుఁ బట్టుకొని దుఃఖావేశమున నిరంతరధారగా ప్రవహించు కన్నీటిచే నభిషేకముఁజేయుచు యీ విధమున ప్రార్థింపఁ దొడఁగెను.

"అయ్యా! విశ్వనాథంగారూ! తమ సెలవులేనిది మీగదిలోనికి వచ్చినందుకు క్షమింపకోర్తాను. నేను చాలా ఆపదలో మునిగిపోయి ఉన్నాను. తమరుతప్ప నన్ను రక్షించే వారింకెవరూ లేరు. నాకు మతిపోయేటట్టుగావుంది. తమ పరిచయం నాకంతగాలేదు కాని మొన్న తమరు హంతకుడగు ఆలీఖాని సాహెబును పట్టుకొన్నప్పటినుంచీ మాక్లబ్బులోనివారికందరికీ మీప్రభావం తెలిసింది. తమరే నాపాలిట దైవమని నమ్ముకొని వచ్చాను." అనుచుఁ చిన్నపిల్లలవలె బిగ్గరగా నేడ్వసాగెను.

అంతట విశ్వనాథము కాళ్లపైఁ బడియున్న యువకుని రెండుచేతులను బట్టుకొని లేవనెత్తి వెనుకకుఁ దీసుకొనిపోయి ఒక కుర్చీయందు కూర్చుండజేయుచు,

"ఇంక మీరు ముందు స్థిమితంగా కూర్చోండి. మీకేమీ భయంలేదు. హడావడిపడకుండా మీరెవరో మీకేమిగావాలో మీకిప్పుడువచ్చిన చిక్కేమిటో నెమ్మదిగా చెపితే నాకు చాలా సంతోషంగా వుంటుంది" అని తానొక కుర్చీలో గూర్చొని యాకుర్చీ యువకునకు చేరువగా నీడ్చెను.

నారాయణదాసు వేసుకొనుటకై దీసిన కోటును చేతిని బట్టుకొనియే దగ్గరగానున్న బల్లపైకెగిరి కూర్చొనెను.

గద్గదస్వరమున యువకుఁడీవిధముగఁ జెప్పఁదొడఁగెను. "విశ్వనాథంగారూ! నాయంతటి దురదృష్టవంతుఁడీ కలకత్తా నగరంలో యెవ్వరూ వుండరు. తమరే నన్ను రక్షించాలి. మీకంటె నాకింకెవ్వరూ దిక్కులేరు. నేను నాకథ చెప్పుసరికి

పోలీసువాళ్లు నన్ను రెస్టు చేయడానికిక్కడకే వస్తారనుకొంటాను; మీరు నామొర సాంతంగా వినేవరకూ వాళ్ళ నాగమనిచెపితే అంతా తమతో మనవిచేసుకోడానికే వచ్చాను. తర్వాత నిరపరాధినగు నామీద కటాక్షముంచి తమరు నావైపు పని చేస్తామని మాటయిస్తే కులాసాగా ఖైదులోనికి పోతాను" అనుచు బొటబొటఁగారు కన్నీటిని చేరుమాలు చేనొత్తుచుఁ బల్కెను.

"ఖైదులోకి తీసుకొనిపోవడం మిమ్మల్నా? చాలా తమాషాగావుందే? ఎందుకు మిమ్మల్ని రెస్టు చేయుచున్నారు?" అని విశ్వనాథమాశ్చర్య సూచకముగఁ బ్రశ్నించెను.

వెంటనే యువకుఁ డించుకంతైన నాలోచింపకయే "చక్రపాణియను శిల్పిహత్యయే కారణ" మనెను.

విశ్వనాథ మాపలుకుల కాశ్చర్య చకితుఁడయ్యెను.

నారాయణదాసు బల్లపైనున్న వార్తాపత్రిక నటు నిటు దిరుగవైచుచు నందేమిచూచెనోగాని తటాలునఁ బత్రికను విశ్వనాథముపై విసరి రెప్ప వేయకుండఁ దదేకదృష్టితో యువకునిఁజూడ నారంభించెను.

"మార్నింగు పేపరేనా యిది?" అని యువకుఁడాతురతతోఁ బల్కెను.

"ఔను" అని విశ్వనాథమనెను.

"ఆ పేపర్లోనే చక్రపాణి హత్యావిషయమంతా ప్రకటించారు. కాళీఘట్టుదగ్గరనుండి పోలీసువాళ్లు నన్ను తరుము

కొస్తున్నారు. తమరే నన్ను రక్షించాలి" అని యొకమాట కొకమాట పొందకుండ నసందర్భముగఁబల్కుచు మరల నేడ్వసాగెను.

"మీకేమీ భయంలేదు. గాభరా పడవద్దని చెప్పుతున్నానుకాదూ!" అనుచు విశ్వనాథము

"దాసూ! చదవోయి! యేమిటో యిదిచూదాం!" అనుచు పత్రికను నారాయణదాసు చేతికందిచ్చెను.

నారాయణదాసు పత్రికనువిప్పి బిగ్గరగా నీవిధమునఁ జదువ నారంభించెను.

## చక్రిపాణియను శిల్పకారుని హత్య.

కడచిన రాత్రి, లేక యీ తెల్లవారుఝామున గాళీఘట్టముదగ్గర నొకవింతయైన హత్యజరిగినది. చంపఁబడినవాఁడు శిల్పములో గొప్ప పేరును సంపాదించి మిక్కిలిగ ధనమార్జించి గౌరవముగా జీవనము చేయుచున్న చక్రిపాణియను నాతఁడు చక్రిపాణికించుమించుగ నేబదివర్షముల ప్రాయముండవచ్చును. కాని యేకారణముననో అతఁడింకను వివాహము చేసుకొని యుండలేదు. చక్రపాణి ప్రస్తుతము నివసించుగృహము, కాళీఘట్టు సమీపముననే. యెఱ్ఱనిరంగు పూయఁబడి యున్న మూడంతస్థుల మేడ. చక్రిపాణినౌకరు అప్పలస్వామి తప్ప యింకెవరునూ, ఆమేడపై సంచరించునట్లు దోచదు. కడచిన రాత్రి రెండుయామములు దాటిన

పిదప చక్రపాణియింటినుండి ఆకస్మికముగ పెద్దమంటలు వచ్చెను. వెంటనే మంటలార్పుటకు నీటియంత్రములు గొనిరాబడినవి కాని, అప్పటికే మంటలు పూర్తిగ నార్పఁబడెను. ఆమంటలు చక్రపాణి గృహావరణలో నున్న కట్టెలగుట్టవైయుండెను. ప్రమాదమున నవి యంటుకొని తగులఁబడెనని మొదట నిశ్చయించిరికాని, పిమ్మట పోలీసు పరిశోధనవలన నింటి యజమానియగు చక్రపాణి మాయమైనట్లు దెలియవచ్చినది. చక్రపాణి పడకటిల్లు చక్కఁగ పరిశోధింపఁబడినది. దానివలన నాతఁడారాత్రి శయ్యపై మేను వాల్చినట్లే దోపదు. చక్రపాణి నిద్రించుగదినుండి వీధిలోనికున్న కిటికీ తెరువఁబడియున్నది. అనేకమైన విలువగల కాగితములు గది నాల్గువైపులను వెదజల్లబడియున్నవి. మఱియు గదియందచ్చటచ్చట పెద్దరక్తపుడాగులు కాన్పించుచున్నవి. ఆగదిలోనే యొక్కచోట రుధిరముదిగ్ధంబైన, చేతిబెత్తమొకటి పడియుండెను. దానిపై "ప్రభాకరరావు, 45 ఆనందసభ." అను నక్షరములు స్పష్టముగాఁ జెక్కఁబడియున్నవి. ఇంకను, చక్రపాణి నిద్రించుగదినుండి, కట్టెలగుట్టవరకు నేదియో బరువగు వస్తువీడ్చినట్లు పెద్ద ఆనవాలు కనఁబడుచున్నది. చేతికఱ్ఱనుబట్టి ఆనందసభలోని 45 వ సభ్యుఁడగు ప్రభాకరరావునకీ హత్యా విషయమున బాగుగా సంబంధముండవచ్చునని దోచుచున్నది. ఈప్రభాకరరావు, పాంబజారు 175 వ నెంబరు

గృహములో నివసించు చుండెను. చక్రపాణి నౌకరు అప్పలస్వామి యీప్రభాకరరావు తన యజమానునితో రాత్రి 9 గంటలకు మాట్లాడుచుండగ, తాను జూచితి ననియుఁ దిరిగి యెప్పుడు ప్రభాకరరావు చక్రపాణి యిల్లు విడచెనో తాను జూడలేదనియు, ప్రభాకర రావింటిలో నుండఁగనే తాను నిద్రపోవుటకై పోయితి ననియుఁ దప్పకుండా, తన యజమానుని చంపినవాడు ప్రభాకరరావేయైయుండుననియు,యజమానుఁడు తనకుఁ జేసిన యుపకారములను, సుగుణములనుఁ జేరొ్కని బిగ్గఱగా నేడ్చుచుఁ జెప్పుచున్నాడు చక్రపాణిధరించు దుస్తుల యానవాళ్ళుకూడ కొన్ని కాలిపోయినగుట్టలో కాన్పించుచున్నవి. కావున నేకారణముననో, ప్రభాకర రావు చక్రపాణిని జంపి హత్యను మభ్యపరచుటకై శవ మును కఱ్ఱగుట్టలోనికీడ్చి నిప్పంటించి తనకుపయోగించు కాగితములు వగైరాలు బట్టుకొని తొందరలోఁ జేతి కఱ్ఱను మఱచిపోయి పాఱిపోయియుండునని యిప్పటికి పోలీసువారు నిశ్చయించుకొనిరి. ప్రభాకరరావునరెస్టు చేయుటకై అప్పుడే పోలీసువారు బయలుదేఱిరి. బహుశా యీసరికి రెస్టుచేసియే యుందురు. ఈకేసును రక్షకభటశాఖలో బహుకాలానుభవము గల్గి గొప్ప పేరువడసిన, సబ్ ఇనస్పెక్టరు ఆనందరావుగారు నడుపు టకుఁ బూనుకొనిరి. పర్యవసానమెట్లుండునో జూడవలసి యున్నది."

విశ్వనాధమంతయు విని రెండు నిముసములట్లే నిశ్శబ్ద ముగాఁ గూర్చొని, తటాలున ప్రిభాకరరావునైపునకుఁ దిరిగి "ప్రభాకరరావుగారూ! మీకీ కేసులో చాలామట్టుకు సంబంధ మున్నట్టుందే! ఇంకా పోలీసువాళ్ళు మిమ్మల్నెందుకరెస్టు చేయలేదో! ఆశ్చర్యముగావుంది సుమండి!" అని ప్రిభాకర రావుపై తీక్ష్ణముగ దృష్టి సారించుచుఁ బల్కెను.

విశ్వనాధము పల్కులకు, ప్రిభాకరరా వెట్టి తడఁబా టును జూపకయే—

"అయ్యా! నేను పాంబజారులో నివసించుచున్నాను. కాని, రాత్రి చక్రిపాణియింట కొంచెము పనుండివెళ్ళి తిరిగి యింటికి వెళ్ళకుండానే దారిలోవున్న ఒకస్నేహితునింట్లోవుండి పోయాను. ఉదయాన్నే, నా స్నేహితుఁడు, మత్తుగా నిద్రి పోతూవున్న నన్ను లేవగొట్టి యీ పేపర్లోవున్న సంగతంతా వినిపించాడు. వెంటనే నాకు శరీరంపై స్మారకం పోయింది. కొంతసేపైనతర్వాత ఆతఁడే పోలీసువాళ్ళు నీకోసం వూరికే తిరిగేస్తున్నారు. వెంటనే నీవు హరిశ్చంద్రిముఖర్జీగారి బంగ ళాకుపో! అసాధ్యుఁడగు అలీఖాన్ సాహెబ్ అను బందిపోటు దొంగను పట్టుకొని ప్రిభుత్వంవారి కప్పచెప్పి గొప్ప బహు మతులను పొందిన విశ్వనాధం అన్నాయన యింకను అక్కడే వున్నారు. ఆయన నీకు తప్పకుండా సహాయం చేస్తారు. వేగిరంపో! అనుచు నన్ను తమవద్దకు పంపించాడు మీరుతప్ప నాకింకెవరూ దిక్కులేరు. తమరే నన్ను రక్షించాలి" అనుచు పొంగిపొరలి వచ్చు దుఃఖము నాపుకొనఁజాలక బావురని

యేడ్చుచు, యింకేమి నో చెప్పుచుండగనే టక్,టక్,టక్,టక్, మను కాలిజోడు చప్పుడుతో విశ్వనాధము పూర్వ స్నేహితుఁడగు సబ్ యిన్స్పెక్టరు, ఆనందరావు విశ్వనాథాదులు గూర్చుని యున్న గదిఁ బ్రవేశించెను. అతఁడు పూర్తిగ రక్షకభటాధికార చిహ్నముల ధరించియుండెను.

"ఓహో! ఆనందరావ్! రా! యిలా కూర్చో!" అనుచు విశ్వనాధమాతని వామహస్తమున తన దక్షిణ హస్తముఁ గీలించి తానిదివఱకాసీనుఁడైయున్న యాసనమున మిత్రునిగూర్చుండఁబెట్టి, నారాయణదాసునకు జేరువగ బల్లపైఁ దాను గూర్చొనెను.

సబ్ యినస్పెక్టరు కుర్చీలో గూర్చొనుచునే ప్రభాకర రావువైపునకుఁ దిరిగి—

"ప్రభాకరరావ్! చక్రపాణి హత్యా కారకుండవగు నిన్ను నేనరెస్టుచేయుచున్నాను" అనెను.

ఉత్తర క్షణముననే దీనములగు చూపులతో విశ్వ నాధమునైపునకుఁ దిరిగిఁ ప్రభాకరరా వప్రయత్నముగనే కుర్చీలోఁ గూలఁబడెను.

"ఆనందరావ్! కొంచెంసేపాగవోయి! పాపమీతఁ డేదో చెప్పుకొంటున్నాడు. వినడానికికూడ చాల సర్దాగా వుంది. ఒకరగంటలోపుగానే నీవీతనిఁ దీసుకొని పోవచ్చును. ఈతని చరిత్ర తప్పకుండా వినదగినదనే తోస్తూవుంది" అని చిరునగవుతో విశ్వనాధ మానందరావుతోఁ బల్కెను. "వినడ మట్టే అవసరమని తోచదు," అనుచు సబ్ యినస్పెక్టరు

సగర్వముగాఁ బ్రత్యుత్తరమిచ్చెను.

"నాకుమాత్రం ముఖ్యముగా వినాలనేవుందిసుమా!" అనెను విశ్వనాథం. "అట్లయినసరే! విశ్వనాథం! నీవడుగునది నేనెట్లుకాదనగలను. నేనుకూడ యిక్కడుండవచ్చునా?" అనుచు ఆనందరావు ప్రభాకరునివైపుకుఁ దిరిగెను.

"తమరు తప్పకుండా ఉండవలెను. అంతావిని నిజం తెలుసుకొని నన్ను రక్షించండని" ప్రభాకరరా వాతురతతో నెను.

ఆనందరావు జేబునుండి వాచీదీసి బల్లపైనుంచి— "సరే! అరగంటలోగా చెప్పు" మని నవ్వుచు విశ్వనాథము వైపున కొకతెరియు, నారాయణదాసుతట్టున కొకసారియు చూపులఁ బరికించెను.

విశ్వనాథము మోచేతుల రెంటను తొడలపై నాని— అరచేతులలో గడ్డముంచి ప్రభాకరరావు చెప్పునదంతయు, మిగుల శ్రద్ధాళుఁడై వినఁదొడంగెను.

---

## రెండవ ప్రకరణము.

అయ్యో! నేను చక్రపాణిని కొద్దికాలం క్రిందటనే యెరుగుదును. అంతకుముందాతఁడు నాతలిదండ్రులను, బాగా యెరుగుదునని చెప్పేవాడు. కాని వారాతనితో యెక్కువ స్నేహితులవలె మాట్లాడడం నేనెప్పుడూ చూడలేదు. నిన్న మధ్యాహ్నంమూడుగంటల కాకస్మికముగా చక్రపాణి నాఆఫీసు

గదిలోనికివచ్చాడు. ఇదివరకెప్పుడూ క్లబ్ లోనైనా, తోవ లో నెక్కడైనా తటస్థంగా కలుసుకుంటే "ఓహో! అంటే ఓహో" అనుకోవడమేకాని ప్రత్యేకించి మాయిద్దరము కలిసి మాట్లాడుకోవలసినం తవసరముండేదికాదు. అతడొచ్చినపని నాతో చెప్పినపుడు నాకు మహాశ్చర్యం కలిగింది. చక్రపాణి చేతిలో చాలకాగితాలున్నాయి. వాటిలో ఒకటి నాకెదురుగా వున్న బల్లమీదుంచి "ఇదిగో! నావీలునామా! ప్రభా కరరావ్! దీనికి శుద్ధప్రతి వ్రాయాలి. నీవు పూర్తిగా వ్రాసే వరకూ నేనిక్కడేకూర్చుంటాను" అనుచు బల్లదగ్గరగావున్న యింకొకకుర్చీలో కూర్చున్నాడు. మాఆఫీసుకు వచ్చేవాళ్ళంద రూ నాచే శుద్ధప్రతులు వ్రాయించుకోడం, తగినట్లు డబ్బివ్వ డం, యిదివరకు మామూలుగా జరుగుతూవుంది. చక్రపాణి వ్రాయుమన్న వీలునామాకూడ అలాంటిదే అనుకున్నాను. కాని వీలునామా కొసవరకూ చదివేసరికి నాకళ్లను నేనే నమ్మ లేక పోయాను. ఎంచాతంటారంటే, చక్రపాణి యావదాస్తి నాపేర వ్రాసుంది. "ఇదేమిటి" దని నేను మొగమెత్తేసరికి

"సంగతులన్నీ తర్వాత చెప్తాను. ముందుపనికానీ, నా కవతల చాలాతొందరపనులున్నాయి" అని నన్ను హెచ్చరిస్తూ నాకించుక దూరంలో వున్న కలము, సిరాబుడ్డి నాదగ్గరగా ఉంచాడు. అందుకు నేనేంజవాబుచెప్పకుండానే వీలు పూర్తిచేసి మొగమెత్తేసరికి చక్రపాణి నవ్వుతూ నేను చేసేపనిచూస్తూవు న్నాడు. వీలునామా మరోసారిచదివాను. నాకు మిక్కిలి ఆశ్చ ర్యంగా వుంది. అలా అయిదునిమిషాలున్నతర్వాతాతడే తాను

బ్రహ్మచారినగుటచేతనూ, వాని తదనంతరం తన ధనమంతా దుర్వినియోగాలు చేయకుండా మంచి పనులకుపయోగించు వానిచేతులలోపెట్టుట తనముఖ్యోద్దేశమనియూ, నాతలిదండ్రు లాతనికి ప్రాణస్నేహితులగుటచేతనూ, నన్నతఁడు కడుపున పుట్టిన బిడ్డకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాననిన్నీ, అందుచేతనే వీలునామా అలావ్రాయడానికి కారణమైందనీ చెప్పేడు. అందుకాతని కనేక వందనములుచేసి, వీలునామా పైని సాక్షు లచే సంతకాలు చేయించాం. ఇదిగో వీలునామా ప్రతి. తమరు చూడండని జేబునుండి యొక కాగితమునుఁదీసి విశ్వనాధమున కందిచ్చెను.

విశ్వనాధ మాకాగితమునుఁ దెరువకయే— "తర్వా తేమయిందో త్వరగా చెప్పండ" నెను.

తర్వాత చక్రపాణి నన్నాఫీసునుం డీవలకుఁ బిల్చి దస్తావేజులు, ప్రాంసరీనోట్లు, రసీదులు వగైరాలు యావత్తు రికార్డు తనయింటివద్ద వున్నదనియు సాయంత్రం యింటికొక మారువస్తే సావధానంగా అన్నిసంగతులూ మాట్లాడుకో వచ్చుననియు, భోజనానికి తనయింటికే రమ్మననునీ చెప్పి— "ఈపనంతా పూర్తయేవరకు, యీవిషయం యెవరకీ చెప్ప వద్దు. నీ తండ్రికి కూడా చెప్పవద్ద"ని నాచే ప్రమాణం చేయించుకొని యింటికి ప్రయాణమై కొన్నడుగులవేసి, మళ్ళీ తిరిగి వెనక్కివచ్చి "నీవెన్నిగంటలకు వస్తావ" ని అడిగెను. ఎనిమిదిగంటలకల్లా వస్తానని చెప్పి నేనాతనితో వీధివరకుఁ బోయి, సాగనంపి "శలవు తీసుకొంటా" నని తిరిగి ఆఫీసులోనికి

పోయాను. విశ్వనాథంగారూ ! అప్పుడు నాయవస్థెలావుంటుందో తమరు కనిపెట్టేవుంటారు. వెంటనే "నేనొక పెద్దపనిమీద ఒకచోటికి వెళుతున్నాను. ఇంటికీవేళ వస్తానో రానో చెప్ప లేన"ని నాతండ్రికి కబురు పంపించి ఆఫీసుమూసి క్లబ్బులోనికి పోయాను. అక్కడ కొంతసేపుండి తర్వాత తిన్నగా చక్ర పాణింటికి పోయాను. అప్పుడు దగ్గరదగ్గరగా తొమ్మిదిగంటలై వుంటుంది. అని యింకేమియో ప్రభాకరరావు చెప్పుచుండగనే—

"ఒక్కనిముసమాగండి, మీరు వెళ్ళేసరికి, చక్రపాణిం ట్లోనే ఉన్నాడా ?" అని విశ్వనాథము ప్రశ్నించెను.

"ఆ ! వీధిలోన" అరుగుమీదొక కుర్చీలోఁ గూర్చొని నన్నుఁజూచి లేచివచ్చి చేయిపట్టుకొని లోనికిఁ దీసుకొనిపోతూ "ఏమోయి ! ప్రభాకరరావ్ ! నీకోసం గంటె యిక్కడ కని పెట్టుకున్నాను. ఇంతసేపయిందేం ? ఇంటికి వెళ్ళొచ్చావా ?" అనెను.

"అబ్బే ! లేదు. ఈవేళ ఆఫీసుమూసేసరికే చాలా ఆల స్యం అయింది. అక్కడనుంచి క్లబ్ లోకివెళ్ళి బాతాఖానీ కొట్టు కుంటూ కూర్చున్నాను. అందుకే యింతాలస్య మయింది క్షమించం"డని నేనాతనితోఁగూడ భోజనములగదిలోనికి వెళ్లేను.

భోజనం అయినతర్వాత చక్రపాణి నన్నుఁ దన పడక టింట్లోకిఁ దీసుకొనిపోయి ఒక తివాసీమీద కూర్చోపెట్టేడు. తర్వాత కట్టలుకట్టలుగావున్న మెనోన్ని కాగితాలు పెట్లోనుంచి తీసి, నాదగ్గఱపెట్టి ఒక్కొక్కటి విప్పుతూ ఫలానా, ఫలానా అని చూపించి "రేపన్నీ సావధానంగా చూదాం, యిప్పటికే

చాల రాత్రియిందని చెప్పి కాగితాలన్నీ పెద్ద కట్టకట్టి దాని మీాద లక్కతో శీలువేసి, నాచే వేలిముద్రి వేయించుకొని పెట్లోపడేసేడు. అప్పుడు సరిగా పదకొండుగంటలైంది, నేనింటికి పోతానని చెప్పిలేచాను.

"సరే! రేపుదయంకాని, సాయంత్రింకాని ఒకసారి వీలుచేసుకొని వస్తావా?" అనుచు చక్రిపాణిలేచెను.

చాల రాత్రిగుటచేత నేనింటికి పోడానికి చక్రిపాణి యిష్టపడడనుకున్నాను. కాని, ఎందుచేతనో నన్నింటికిం బొమ్మనే అభిప్రాయం కనఁబర్చాడు. అత నుండమనకుంటా, వాడింట్లో వుండడం మంచిదిగాదనుకొని యింటికిం పోదామని నిశ్చయించుకొని బయలుదేరినాను. వీధిదాటేసరికి చేతికర్రి మాట జ్ఞాపకంవచ్చింది. కాని, మల్లీదానికోసం వెనక్కివెళ్ళడం మంచిపని కాదనుకొని చక్రిపాణి దగ్గఱ శలవు తీసుకొని రెండు ఫర్లాంగులువచ్చాను. చీకటి మహాదిట్టంగావుంది. కన్ను పొడుచుకొన్నా మనిషి మొగం మనిషి కగపడడంలేదు. ఇలాంటప్పుడు చాలదూరమున్న యింటికి పోడానికి భయపడి అక్కడికి దగ్గఱగావున్న ఒకస్నేహితునింట్లో వుండిపోయాను.

"నీ స్నేహితునిపేరేమిటి- అతనేంపని చేస్తూన్నా"డని విశ్వనాధమడిగెను.

"నాస్నేహితునిపేరు దుర్గాప్రిసాద్. అతఁడిక్కడకు చాలా దగ్గఱలోవున్న కె. బి. యన్. బ్రదర్సు అండ్ కో., లో క్లార్కుగా వున్నాడు."

"సరే! తర్వాతసంగతేమి?"

"తర్వాతవడానికేముంది. అంతా తమకు విశదమే. భారం కూడ తమదే. చక్రపాణి నెవరు చంపారో, ఎందుకు చంపారో, నాకు మహాశ్చర్యంగా వుంది. నే నీవిషయంలో కేవలం నిర్దోషిని. నిజం తెలుసుకొని రక్షించాలి" అనుచు నే కన్నీళ్ళను గార్చుచు, విశ్వనాథమానందరావులను గడుం దీన ముగఁ బ్రార్థింప నారంభించెను.

అపుడానందరావు విశ్వనాథమువైపునకు గిరుక్కునఁదిరిగి-

"విశ్వనాథం! ఈతనితో యింకేమైన మాట్లాడవలసిన పనుందా?" అని కనుబొమల నెగురవైచుచుఁ బ్రశ్నించెను.

"పాంబజారునకు వెళ్లేవరకేమియు లేనట్లే" అని విశ్వ నాథము నవ్వుచుఁ బ్రత్యుత్తర మిచ్చెను.

"పాంబజారుకా?" అని యాశ్చర్యముగ ఆనంద రావనెను.

"అవును."

"విశ్వనాథం!" నీతో కొంచెం మాట్లాడ వలసిన పనుంది. ప్రభాకరరావ్! నీకోసం నలుగురు కానిస్టేబిల్సు వీధిలో కనిపెట్టుకొని ఉన్నారు. రా!" అనుచు ఆనందరావు లేచి "ఇపుడే వస్తా" నని విశ్వనాథం వీపుపై మెల్లగా దట్టి వీధిలోనికిఁ బోఁదొడఁగెను. వెంటనే ప్రభాకరరావు విశ్వ నాథమునకుఁ బ్రణమిల్లుచు జాలికరములగు చూపులతో

"శలవు! ఈ దీనుని మరువకుడు, నిరపరాధిని రక్షించుభారము తమదే!" అనుచు ఆనందరావుతో వీధిలోనికిఁ బోవుచుండగా విశ్వనాథము గుమ్మము వరకునుబోయి—

"నీకేమీా భయంలేదు. ప్రభాకరరావ్! నీవిషయంలో నాకు చేతనైనంత సహాయం తప్పకుండా చేస్తాను. నీవు నిర్దోషి వయినట్టయిన నిచ్చింతగా వుండవచ్చును." అని విశ్వనాథ మక్కడనే నిలచెను. "తమ దయ — కేవలము నిర్దోషిని" అనుచు చేరుమాలుచే కన్నీటినద్దుచు ప్రభాకరరావు సబ్ యినస్పెక్టరుతో వీధిలోనికిఁ బోయెను. అక్కడ నల్గురు రక్షక భటులు వేచియుండిరి వారలతో ఆనందరావు "మీారీతనిఁ దీసుకొనిపోయి నేవచ్చువరకు స్టేషనులో వుండం"డని ప్రభాకర రావును వారలకప్పగించి తానుఁ దిరిగి విశ్వనాథం గదిలోనికిఁ బోయి యథాస్థానమున నాసీనుఁడై నవ్వుచూ "విశ్వనాథం! ఈ కేసులో ప్రభాకరరావునుఁ గూర్చి నీవింత వింతపడవలసిన అవసరమున్నట్లు తోచద"నెను. ఆమాటల కొకించుక మంద స్మితుఁడై విశ్వనాథమిట్లనెను.

"వింతపడవలసిన విషయమే యిందెక్కువగావుంది." విశ్వనాథము పల్కులకు నారాయణదాసు ఫక ఫక నవ్వుచూ ఆనందరావుదిక్కు మొగమై—

"అసలు యీా మనిషే వింతమనిషి. ఆలాంటప్పుడు ప్రతివిషయంకూడ యీాతనికి వింతగానే వుంటుంద" నెను.

"నీవనుకొంటూవున్న వింతేమిటో చెప్పుదూచూదాం" అనుచు ఆనందరావు జేబునుండి సిగరెట్టుపెట్టెనుఁదీసి మిత్రు

లిరువురకును చేరియొకటినిచ్చి తానొకటి నోటనుంచి నిప్పంటించెను.

విశ్వనాథ, నారాయణదాసులును తమతమ సిగరెట్లకు నిప్పంటించి నోటనిండుగా పొగనుఁబీల్చుచు, వింతవింత రకములగు, చిత్రాకృతితో చుట్టలుగా దిరుగునట్లు ధూమవిసర్జనముఁ గావించుచుండిరి. రెండునిముసములట్లేఁ గడచిపోయెను. మువ్వురును కలసి ఆగదంతయు సిగరెట్లపొగచే నింపివైచిరి. అప్పుడే ఉదయభానుడు తన బాలకిరణములను కిటికీగుండా పొగను ద్రోసుకొనుచు విశ్వనాథాదుల గదిం బ్రసరింపఁ జేయుచుండెను.

“వింతేమిటంటావా? అయితే చెప్తానువిను” అనుచు విశ్వనాథం, చేతులోనున్న సిగరెట్టు నావలకు విసరివైచి “వీలునామాలో చక్రపాణి ఆస్తంతా ప్రభాకరరావునకు చెందునట్లు వ్రాసుందా?” అనెను.

“అవును.”

“అయాచితంగా ఆస్తంతా యిచ్చినవానిని యెలాంటి మూర్ఖుడైనా చంపేస్తాడా?”

“వెంటనే ఆస్తిచెందవలెనని ఎందుకు చంపగూడదు?”

“అలాగైతే, చంపేవాడు తనకేమీ చిక్కురాకుండా బాగాచూచుకొని చంపుతాడు. కాని, అల్లాకాకుండా వీలునామా వ్రాసిచ్చిన నాటి రాత్రే చంపఁదలచుకొన్నవాని యింటికి పబ్లీకుగా వెళ్ళి చంపుతాడా? ఎవ్వరైనా అనుమానిస్తారనైనా ఆలోచించడా?”

"అసలు హత్య జరిగినట్లు తెలియకుండా చేద్దామనే శవాన్ని కరర్రలగుట్టలో పడేసి కాల్చాడు."

"నీ వలా అనుకొంటున్నావు కాబోలు!"

"నీవుమాత్రం!" అని ఆనందరావించుక చీకాకుగాఁ బల్కెను. అందులకు విశ్వనాథము చిరునగవుతో—

"బాగా నేవుంది. కాని, కేసు బాగాపరిశోధించిందాకా నేనేమీ చెప్పలేను" అనెను.

"చెప్పడానికేముంది? నేచెప్తానువిను—ఇదిగో! ఒక ముసలివాడు దిక్కులేనివాడు చస్తే మంచిఆస్తి దొరకడానికి వీలుంది. అప్పుడువీలున్న వాడేంచేస్తాడు? యెవరితోనూ, యేమీ చెప్పకుండ వాడిప్రయత్నంలో వాడుంటాడు. కొంతరాత్రియైన తర్వాత ముసలాడింటికివెళ్ళి ఒంటరిగా వున్న వానిని జంపి, పోలీసువాళ్ళకేమీ ఆచోకీ తెలియకుండా చేద్దామని శవాన్ని కరర్రలగుట్టలో పడేసి నిప్పంటించాడు. చంపిన చేతులతో తానింటిదగ్గఱనుండి తెచ్చిన చేతికర్ర, ఆయుధం మొదలైనవి పట్టుకొని పారిపోదామని అనుకొని తొందరలో పొరపాటున చేతికర్రమాత్రం మరచిపోయాడు. నిప్పంటించిన వెంటనే మంటలుఁజూచి యిరుగుపొరుగువారు పరుగెత్తుకొని వస్తారని తొందరగా పారిపోయుంటాడు. లేకపోతే చేతికర్రను మరచిపోయి ఉండడు. ఇందు కేమీ సందేహం లేదు" అనుచు గర్వముగా నుడివెను. విశ్వనాథ మానందరావు చెప్పిన దంతయు సాంతముగా విని ఒక్కనిముసము మిన్నకొని—

"ఆనందరావ్ ! నీమనస్సంతా యిలావుంచి విను ! నీవే ప్రభాకరుని స్థితిలో వున్నావనుకో. నీకు ఆస్తంతా యేరోజున వీలువ్రాసివుందో ఆరోజునే వ్రాసిచ్చినవానినే చంపేస్తే నీమీదనుమానపడ్డానికి వీలుండదంటావా ? లేదా ? హత్యకీ వీలునామాకీ యింత సంబంధముందని నీకు తెలుసుండి కూడా యెప్పుడైనా యిలాంటిపనిచేస్తావా ? ఇంకా నీవారాత్రి చక్రపాణి యింటికి వెళ్ళినట్లు అతని నౌఖరు అప్పలస్వామికి తెలుసునని నీవెరుగుదువుకదా ? ఆలాంటప్పుడు మూర్ఖుఁడైనా యింతసందర్భమైన హత్యచేస్తాడా ? అదిగాక నీవు హత్యచేసేసావయ్యా. నీఆయు పట్టయిన పేరు బాగాచెక్కఁబడి పట్టుపడడానికి బహువీలుగావున్న నీచేతికర్ర నేలాంటి తొందరలోనైనా మరచిపోతావా ? ఇలాటసందర్భాలు చాలావున్నాయి కాబట్టి చక్రపాణియిల్లు చక్కఁగా పరిశోధిస్తేకాని యేమీ చెప్పలేన" నను.

"పోనీ, ప్రభాకరరావు కాకుండా యీహత్య యింకెవరు చేసుంటారో చెప్పగలవా ? " అనుచు ఆనందరావు దగ్గఱగా కత్తెరింపఁబడి యేదుబంది ముండ్లవలె నున్న తన మీసమును క్రిందిపండ్లతో నొక్కుచుఁ బల్కెను.

ఆనందరావు పల్కులకు విశ్వనాధము పండ్లన్నియు కనిపించునట్లు గట్టిగానవ్వుచూ యీవిధమున చెప్పదొడంగెను—

"ఓ ! ఆలానువ్వడిగితే పదిమోస్తరులుగా చెప్ప గలను. విను— చక్రపాణి కాగితాలన్నీ ప్రభాకరరావుకి

చూపిస్తూవుంటే గదిప్రక్కనుంచి వీధిని పోతూవున్న యెవ్వడైనా కిటికీగుండా చూసుంటాడు. డబ్బు, నోట్లు, మొదలైన మాటలు విని ప్రభాకరరావు వెళ్లినవెంటనే కిటికీలోనుంచి గదిలోనికిదిగి ఒంటరిగావున్న చక్రపాణిని చంపి డబ్బు, కాగితాలు సంగ్రహించి పారిపోయుంటాడు."

"అలాగైతే బాటసారి శవాన్ని కాల్పవలసిన అవసరమేమి?"

"అట్లు ప్రభాకరరావుమాత్ర మెందుకు చెయ్యాలి?"

"హత్యను మభ్యపరచుటకై."

"అలాగే బాటసారిగూడ హత్యయే జరిగినట్లు తోపింప చేయడానికి"

విశ్వనాథము, తన్ను హేళనచేయుచున్నాడని గ్రహించి, ఆనందరావించుక కోపముతో—

"విశ్వనాథం నీసమర్థనంతా మిక్కిలసందర్భముగావుంది. నీవు నన్ను గమ్మత్తు చేస్తున్నావు. కాని, మరొకటికాదు. సరే—

నీవు నీబాటసారిని పట్టుకోవడానికి ప్రయత్నంచేయి. నేనుమాత్రం యిపుడు మాకు పట్టుబడినవాడే, నిజమైన నేరస్థుడని అనుకొంటున్నాను. నేనుమళ్ళీ నిన్ను కలిసికొంటాను. కొంచెం పని వుంద''నుచు మిత్రులిరువురివద్దను శలవు గైకొని చరచర వెడలిపోయెను.

విశ్వనాథ మానందరావులు చిరకాల స్నేహితులు. అనేక విషయములలో ఆనందరావునకు విశ్వనాథమెన్నియో

మహోపకారములనుచేసి అతఁడింతవాడగుటకు తానే ముఖ్య కారకుడయ్యెను. ప్రస్తుతము విశ్వనాధము కలకత్తా వచ్చుటకీ యానందరావే కారణము.

ఆనందరావు గదివీడి చనినపిదప విశ్వనాధము నారాయణదాసు వీపుపై నొక్కచరుపు చరచి—

"దాసూ ! ఈహత్యలు మనం యింటికి పోడానికిష్టపడకుండా వున్నాయోయి" అనెను.

గదిలో యింతసేపటినుండియు, జరుగుచున్న గడబిడకు నోరైన మెదపక శిలాప్రతిమవలె గూర్చుని కండ్లు మిటకరించుచుఁ జూచుచున్న నారాయణదాసు విశ్వనాధము వీపుపై జేసిన పరామర్శచే ఉలికిఁబడి లేచి—

"నీకుకూడ యిష్టంలేనట్టుంది సుమా ! లేకపోతే యింత స్పష్టంగా కనఁబడుతూవున్న కేసుకడ్డంగా వాదిస్తావేమిటోయి" అనుచు కిళ్లీకొరకైకాబోలు జేబును దడుముచు బల్కెను.

"ఏమో ! మీకందరికీ స్పష్టంగా కనిపిస్తూవున్నది. నామట్టుకది వంకరగానున్నట్లుంది. నాకిప్పటికి ప్రభాకరరావు వైపు పనిచేయడానికి ఒక్కాధారమైనా లేదు. నేరమంతా అతనితలపై బడివుంది. ఎందుచేతనోకాని ప్రభాకరరావునుఁ జూస్తే, యేమీ యెరుగనట్లు అమాయకుడులాగున్నాడు సుమా ! ఏమంటావ్" అనెను. "ఆ ! అలాగా ! నేనుకూడా యేదైన నేరంచేసేసి యేమీ యెరుగనట్లుగా చూసేవాళ్ళ

గుండె నీరైపోయేలాగ నటించగలను. ఊరకే కుంచెడు నీళ్ళ కేడ్వగలను" అని నవ్వుచూ నారాయణదాసు ప్రత్యుత్తర మిచ్చెను.

"ఏమిటీ! ఏమంటున్నావ్! నీవుయేదో పెద్దనేరం చెయ్యనక్కరలేదు. ఏదైన చిన్న అబద్ధమాడి సరిగా నామొగం చూద్దూ? అపుడు చెప్తాను నాతమాషా" అని విశ్వనాథము రెండుచేతులను నారాయణదాసుపై నుంచుచు బల్కెను.

"సరే! అదేదో చూదాంకదూ? సర్దుకొంటున్నా వేమిటి? ఎక్కడికీ ప్రయాణం" అని నారాయణదాసు ఆశ్చర్యముగ నడిగెను.

"పాంబజారుకి వెళ్తాను. నీవు కూడా రాగలవా?"

"నన్నెందుకు చంపుతావు, నాకు నిద్రవస్తూవుంది. నీవైన భోజనంచేసి వెళ్ళగూడదూ? వచ్చేసరి కెంతవేళవు తుందో?"

"అబ్బే! ఎందుకూ! మళ్ళీ యిప్పుడే వస్తాను."

"అవునుగాని నీవు హత్యజరిగిన చక్రపాణియింటికి వెళ్ళ కుండా పాంబజారో అని పట్టుకున్నా వేమిటి?"

"అదంతా నీకెందుకు పోనిద్దూ! నీవుకూడ నాకాలో చన చెప్పడమేనా!" అని నవ్వుచూ— "భోజనానికి వస్తే వస్తాను. లేకపోతే యేదైన హోటలులోకి పోతాను. నీవు మాత్రం నాకోసం కనిపెట్టుకొని ఉండనక్కరలేదు" అనుచు

విశ్వనాధము గొడుగును చేతఁబట్టుకొని త్వరిత గమనమున సాంబజారు దిక్కుగాఁ బోఁదొడంగెను.

---

## మూఁ డ వ ప్ర క ర ణ ము .

విశ్వనాధము బసకు వచ్చుసరికి చాలాకాలము పట్టెను. సరిగా సాయంత్రి మైదుగంటలైనది. కాని ముఖమునందే మియు, సంతోషచిహ్నములుఁ గాన్పించుటలేదు. నారాయణ దాసు విశ్వనాధముతో "ఏమోయి! భావా! కథయెలా వుంది?" అని నవ్వుచుఁ బ్రశ్నించెను. అంతా తప్పు త్రోవ లోనే వుందోయి! దాసూ! ఈ కేసులో ఆనందరావు మహా గర్వపడుతున్నాడు. నేననుకొన్నదొకటి, నాకు తెలిసిందొకటి, జరిగిందింకొకటి, అయివున్నట్లుగా తోస్తూవుంది. ఇదివరకు నేను పొందిన పేరంతా యీవిషయంలో పోవునేమో అని సందేహిస్తున్నాను."

"నీవు సాంబజారుకు వెళ్ళావా?"

"ఒక సాంబజారుకే కాదు. చక్రిపాణి యింటికి కూడా వెళ్ళేను. సాంబజారులో నాకు తెలిసిందేమిటంటే, చక్రిపాణి కఠినమనస్సు గలవాడనియు, పట్టినపట్టు విడుచు స్వభావము గలవాడు కాడనియు, చాల జిత్తులమారనియు తెలిసికొన్నాను. ప్రభాకరరావుతండ్రి కొడుకుకోసం వెర్రి వానివలె తిరిగేస్తున్నాడు. తల్లి గోలుగోలున యేడుస్తూ—

చక్రపాణి ఆఖరికి తనకపాయం చేసాడనీ, ఎన్నిమాట్లు కొడుకుతో, దుర్మార్గులతో స్నేహంగా వుండొద్దని చెప్పినా, తనమాట పిచ్చికింద చూచేవాడనిన్నీ తనకొడుకు కొంప దీసిన వారు చక్రపాణే అనిన్నీ ఏడుస్తూవుంది".

"ఆమెతో నీవు మాట్లాడినావా?"

"చాలసేపు మాట్లాడినాను. ఆమెకు పెండ్లికాకముసుపు ఆమె తలిదండ్రిలు మొదట చక్రపాణికే తన్నిచ్చి పెండ్లి చేయడానికి నిశ్చయించారనీ, తర్వాత చక్రపాణి నడత మంచిది కాదని తెలిసి మానివేసినారనీ" చెప్పింది. ఆమాటలకు నేను నీమీాదవున్న ప్రేమచేతనే చక్రపాణి ఆ స్తంతా నీకొడుకు పేర వ్రాసినాడని చెప్పి వీలునామా ప్రతికూడా చూపించాను. అది చూచి ఆమె మరింత బిగ్గఱగా నేడ్చుచూ, "కాదు నాయనా! కాదు! ఇదంతా ఏదో కుట్రకాని మరొకటికాదు. స్వస్థలంవిడిచి యిక్కడకువచ్చిన కొన్నాళ్లవరకూ నన్నుతనతో లేచిరమ్మని కబుర్లంపేవాడు. కొన్నాళ్ళకు నేనామాట సహింపలేక ఇకమీాదిల్లాంటి కబుర్లనుగాని పంపినట్లయితే తగినట్లుగా బుద్ధి చెప్పిస్తానని జవాబు చెప్పినాను. అప్పటినుంచీ మా కుటుంబంమీాద ఒక కన్ను వేసేవున్నాడు. చివరకిపగసాధించాడు. నాకొడుకెన్నడూ యిలాంటి ఘోరమైన పనిచేస్తాడని నేను నమ్మను. దీనజనరక్షకుండగు ఆభగవంతుడే నాకుమారుని రక్షించు"నని చెపుతూ యేడవడం ఆరంభించింది. తర్వాత నేనామెను కొన్ని ప్రశ్నలడిగి ఉపయోగంలేని జవాబులంది అక్కడనుంచి తిన్నగా చక్రపాణింటికి పోయాను".

"అక్కడ సంగతులేమిటి?"

"చక్రపాణి యిల్లు చాలాపెద్దది. అది మూడంతస్థుల మేడ. చూడడానికి మంచిందంగా వుంది. చక్రపాణి గొప్ప పేరుబొందిః శిల్పిగదా! అంచాత స్వంతంగా కట్టి వుంటాడు. హత్య కిందగదిలోనే జరిగింది. ఇంటిచుట్టూ యెత్తయిన ప్రహారీగోడ వుంది. ప్రహారీగోడకు యింటికీ వున్న ఖాళీస్థలంలో వున్న కర్రలగుట్టపైనే చక్రపాణి శవము కాల్చబడినది. చంపబడిన స్థలం మొదలయినవన్నీ బాగా పరీక్షించాను. అక్కడానందరావులేడు. రక్షకభటులున్నారు వాళ్ళు గౌరవంగా కూర్చోమని కుర్చీయిచ్చి ఆనందరావాదులు కర్రల గుట్టలనుంచి నేరం రుజువుచేయడానికని తీసి దాచిన ఆనవాళ్లు తెచ్చి చూపించారు. అందు ముఖ్యమయినవి చక్రపాణిధరించు కోటు, పంట్లాముల బొత్తములు వగయిరాలు. అవి చక్రపాణివే అనుటకేమీ సందేహంలేదు. మనం పేపర్లో చూచినసంగతులన్నీ సరిగా వున్నాయి. ప్రభాకరరావు చేతికర్ర అక్కడే వుంది. దానినిండా రక్తపుడాగులంటుకొనివున్నాయి. చక్రపాణి గదినుండి కర్రలవరకూ శవాన్ని యీడ్చినట్లుగా ఆనవాలు బాగా కనిపిస్తూవున్నది. అక్కడ పడివున్న కాగితాలనుబట్టి చూస్తే ఏవో కొన్నవసరమయిన కాగితాలు పోయినట్లుగా వుంది. చక్రపాణినౌఖరు అప్పలస్వామక్కడే వున్నాడు. వాడు చాల గట్టివాడులాగున్నాడు. వాడిని చాలా ప్రశ్నలువేసేను. ఏదో ఉపయోగంలేని జవాబులేకాని ఒకదానికి సరిగా సమాధాన మీయలేదు. పైకి చెప్పడానికిష్టములేని సంగతేదో

దాస్తూవున్నట్టుంది. వాడిప్పుడు చెపుతున్న దేమిటంటే ప్రభాకర రావు రాత్రి తొమ్మిదిగంటలకు చక్రిపాణింటికి వచ్చినాడనిన్నీ అక్కడే భోజనంచేసినాడనీ ఇదివరకెప్పుడూ ప్రభాకరరావలాం టప్పుడు రావడం మామూలులేదనీ వచ్చేటప్పుడు ప్రిభాకర రావు చేతిలో యేదైనా ఆయుధం వుందో లేదో చెప్పలేననిన్నీ, చేతికర్రిమాత్రిం చూచినాననిన్నీ ప్రిభాకరరావు తన యజ మాని కలిసి లోపలకు పోయినప్పుడు తాను బయటనే వుండి పోయాననిన్నీ ఒకగంటవరకూ ప్రభాకరరావు బయటకు వచ్చు నేమో యని కనిపెట్టుకొని కూర్చొని యెప్పటికీ రాకపోవడం చేత నిద్రకుండలేక తనమామూలు గదిలోనికి పోయి నిద్రి పోయాననీ తర్వాత 'అగ్గి' అను కేకలు వినఁబడేవరకూ యేమి జరిగినదో తన కేమి తెలవదనీ చక్రపాణిని చంపినవాడు తప్ప కుండా ప్రభాకరరావే అయివుంటాడనీ చెప్పుచు యజమానిని దలచుకొంటూ యేడవడం మొదలుపెట్టేడు. తర్వాత నేను 'నీయజమాని కెవ్వరయినా విరోధులున్నారా' అని అడిగి నాను. 'యెవరికయినా విరోధులుంటారు కాని నాయజమాని కెవ్వరూ లేర' న్నాడు, వాటన్నింటికేంగాని ప్రభాకరరావు నిర్దోషని రుజువుచేయడం బహుకష్టం లాగుంది. ఏమంటే! ఇంతవరకూ నాకొక్క పిసరయినా పనిచేయడాని కాధారం కనిపించడం లేదు. "కాని— కాని" అని తల నాడించుచు "ప్రభాకరరావు కేవలం నిర్దోషి. నీవాతనిని రక్షించడానికి తగినంత ప్రియత్నంచేయు" మని నాఅంతరాత్మ నొక్కి చెప్పు తూవుంది. ఏమీ తోచడంలేదు" అనుచు రెండుచేతులను

తలపై నిడుకొని విశ్వనాథము వెల్లకిల కుర్చీలోఁబరుండి నెమ్మదిగా యిట్లుఁబల్కెను. "అప్పలస్వామి కేదో రహస్యం తెలుసును. ఆరహస్యంయేఁమిటో తెలియడంలేదు. వాడు చెప్పనూ చెప్పడు. ఈకేసులోమాత్రం దాసూ! దారీ తెన్నూ కనఁబడకుండావుందోయి!" అని యొక నిట్టూర్పుచ్చి "ఒక్కటి మాత్రంవుంది. అదేమిటంటే, చక్రపాణి యింట్లోవున్న కాగితాలుఁబట్టిచూస్తే అతనుపేరవున్న బ్యాంకుసొమ్ములో చాలా వరకు రంగనాథుఁడన్న వానికి చెక్కిచ్చినట్లు కనబడుతూ వుంది. ముందుగా యీ రంగనాథుఁడెవ్వడో తెలుసుకోవాలి, తర్వాత చక్రపాణికి యీ రంగనాథుడికి యేఁలాంటి సంబంధముందో కనిపెట్టాలి. తెలిసిందా? ఏమంటావ్!"

నారాయణదాసు విశ్వనాథము చెప్పినదంతయు విని చికాకుతో మొగము చీదరించుకొనుచు—

"ఏమిఁటో! నాకేమీ తెలియదు. మనకెందుకీ చిత్తక్షోభ. వూరికే బుఱ్ఱబద్దలుకొట్టుకుంటావ్! క్రమంగా పిచ్చియెత్తిపోయే లాగుంది! యెవడేలాపోతే మనకేంగావాలి హాయిగా యింట్లో కాలుమీద కాలువేసుకొని కూర్చోకుండా, బీచ్చిని షికార్లు కొట్టుకోకుండా చేతిడబ్బుబాగోతం మనకెందుకూ!" అని యింకేమియో చెప్పుచుండగనే విశ్వనాథము నవ్వుచూ—

"ఏమిటోయి! దాసూ! మహాజోరుగా కొట్టేస్తున్నావ్ లెక్చరు! రా! అలా కొంపిలు కేసి తిరిగొద్దాం" అనుచు నారాయణదాసు చేయిపట్టుకొని వీధిలోనికిఁదీసుకొని పోయెను.

నారాయణదాసుదయమే నిద్రనుండి మేల్కాంచి విశ్వనాథమున్న గదిలోనికిఁబోయి ఆతనిఁజూచి తెల్లపోయెను. ఏమన: విశ్వనాథము కండ్లెఱ్ఱని నిప్పులవలెనుండెను. రాత్రి విశ్వనాథము నిద్రించినట్లు దోచదు. కుర్చీలో అట్లే రెండు చేతులను తలపై నిడుకొని దీర్ఘాలోచనా నిమగ్నుడై యుండెను. ఎదురుగానున్న బల్లపై నొక కాగితము పడి యుండెను. నారాయణదాసునుఁజూచి విశ్వనాథము తటాలున లేచి—

"ఏమోయి దాసూ! అప్పుడే లేచావేం! మహావిచిత్రంగా వుందిసుమా! ఇదేమిఁటో చూడు!" అనినవ్వుచూ బల్లమీద నున్న కాగిత మందిచ్చెను. నారాయణదాసాతురతతో చూచి "ఇది ఆనందరావు పంపించిన చీటీలాగుంది!" అనెను.

"అవును ఆసంగతెవళికి తెలియదు. అందులో యేముందో గట్టిగా చదువుదూ?" అని చిరునగవుతోఁ బల్కెను.

"ప్రభాకరరావే నేరస్థుఁడని బలపరచుటకై గొప్ప ఆధారము దొరికినది. కావున వెంటనే బయలుదేరి ఒకసారి రాగోరుచున్నాను, ఆనందరావు" అని వున్నది.

"అలాగైతే మనం తప్పకుండా బయలుదేరవలసిందే! వాళ్ళనుకొన్న ఆధారం మనకే ఉపయోగిస్తుందేమో ఏమంటావ్! నీవుకూడా రా!" అనుచు విశ్వనాథము కుర్చీనుండి లేచెను.

నారాయణదాసు కొండడితో తేనీరు తయారుచేయుమని చెప్పి తానుఁగూడ ప్రాతఃకాల కృత్యములను నిర్వర్తించుకొనుటకై నావలికిఁ బోయెను.

ఒక అరగంటకాలము గడచినపిదప విశ్వనాధమును, నారాయణదాసును యథాస్థానములందాసీనులైరి.

అప్పటికే విశ్వనాధం విశ్వాసభృత్యుఁడగు కొండడు ఆవిరిగ్రక్కుచున్న టీపాత్రను బల్లపైనుంచి యజమానుల రాకకై నిరీక్షించుచు వారలనుఁజూచిన వెంటనే సవినయముగ లేచి నిలుచుండెను.

తేనీరు పానానంతరము తగిన ఉడుపులందాల్చి నారాయణదాసు సమేతుఁడై విశ్వనాధము ఆనందరావు దగ్గఱకుఁ బోవుచుండగా దారిలో తనకెదురుగావచ్చి నొక సుందరాకారుఁడగు యువకుఁడు "విశ్వనాధంగారూ! నమస్కారము"నుటచే అపరిచితుఁడగు నా యువకుఁ డెవఁడై యుండునని తెల్లవోయి నమస్కారమందుకొనుచు "అయ్యా! మీరెవరో నాకు జ్ఞాపకం రాకుండావుంది. దయవుంచి మీరెవరో కొంచెం చెప్తారా?" అనెను.

"చిత్తం! నేనెప్పుడూ తమదర్శనం చేయలేదు కాని తమరెవరో తమరు చేస్తూవున్న పరోపకారాలెట్టివో నాకు బాగా తెలుసును. మాది మొదట కాపురస్థలం ఏలూరు కాని యిప్పటికేడెనిమిది సంవత్సరాలనుంచి యిక్కడే కె. బి. యన్. బ్రదర్సుండుకోలో క్లార్కుగా వున్నాను. నా పేరు దుర్గప్రసా

దంటారు. ప్రభాకరరావు నాకు ప్రాణస్నేహితుఁడు. ఇపుడతఁ డెలాంటి చిక్కులో పడ్డాడో తమకు విశదమైయే వుంది. ప్రభాకరుఁ డెప్పుడూ యింత ఘోరమయినపని చెయ్యఁడు. ఉత్తలఅమాయకుఁడు. కేవలం నిర్దోషి; అతని రక్షించుభారము తమదే. దీనజనులపాలిట దైవసమానులైన తమతో యీ సంగతి మనవిచేసుకోడానికే వస్తున్నాను'' అనుచు ప్రార్థన పూర్వకముగ యువకుఁడు నుడివెను.

"సరే! నే నిపు డర్జంటుపనుండి ఒక చోటికి వెళ్తున్నాను. మరొకసారి మనం సావధానంగా మాట్లాడదాం క్షమించండ''నుచు నా యువకుని వీడ్కొని విశ్వనాథము చక్రపాణి గృహాభిముఖుఁడై బోఁదొడఁగెను.



## నాల్గవ ప్రకరణము.



"ఏమోయి! విశ్వనాథం! నీబాటసారి దొరికాడా?" అనుచు ఆనందరావు చిరునగవుతో యించుకం బరిహాస సూచకముగ విశ్వనాథము భుజముపైఁ దట్టుచుఁబల్కెను.

ఆనందరావు గర్వపుఁ బల్కులకు విశ్వనాథము లోలోన నవ్వుకొనుచు బయటికేదియో నాలోచించు వానివలెఁ గన్పట్టుచు——

"ఇప్పటికింకా అలాంటిదేమీ లేనట్లే!" అనెను.

"మా నేరస్తునిపై నేరం దృఢపరచడానికి మంచాధారం దొరికిందిసుమా!"

"అలాగా! ఏమో యిలాంటి నిదర్శనాలు రుజువు చేయగలవా!" అని నెమ్మదిగా గొణుకుకొనుచు "ఏమిటా ఆధారం" అనెను విశ్వనాథం. ఆనందరావు గట్టిగా నవ్వుచూ "విశ్వనాథం! నీవు మునుపటిలాగ బుద్ధి చురుకుగా పోనీడం లేదు సుమా! నీవిదివరకు చేసిన పరిశోధనలు చూస్తే యీ మాత్రం స్వల్పవిషయంలో తప్పభిప్రాయం పడతావంటే యెవరయినా నమ్ముతారా? లేకపోతే మనసంతా విశాఖపట్నం సముద్రంగా లక్షిస్తుందా ఏమిటి?" అని పరిహాసముఁ జేయుచు "ఇలారా! ఇలా!" అనుచు విశ్వనాథము చేయి బట్టుకొని నాటిరాత్రి చక్రపాణి యింట్లో ప్రభాకరరావు

భోజనముచేసిన గదిలోనికిఁదీసికొనిబోయి "ఇదిగో! చూడు!" అనుచునొక గోడపై వ్రేలుంచి నేమో చూపించుచు—

"ప్రభాకరరావు నిన్నటిరాత్రి యిక్కడే భోజనం చేసేనని చెప్పేడు. జ్ఞాపకంవుందా? భోజనం చేసేటప్పుడు వేసుకొనివున్న కోటుఁతీసి యిక్కడ తగిలించుంటాడు. చక్రపాణిని చంపి శవాన్ని కర్రలగుట్టలో వేసి నిప్పంటించి పారిపోయే టప్పుడు యిక్కడ కోటునుఁ తీసుకొని పారిపోయాడు. అప్పుడు చేతులనిండా రక్తం అంటుకొని వుండడంచేత యీగుర్తు పడి వుంటుంది" అనుచు నూతనముగా సున్నము వ్రాయఁబడి తళతళ మని మెరయుచున్న తెల్లని గోడపై స్పష్టముగాఁ గానవచ్చు చున్న యెఱ్ఱని వ్రేలిగుర్తునుఁ జూపించెను.

విశ్వనాథ మానందరావు మాటలు ముగియకుండగనే సూక్ష్మదర్శికా యంత్రము (Mycroscope) నుఁ దీసి యీ గుర్తునుఁ బరిశీలించుచు "ఆనందరావ్! ప్రభాకరరావు చేతివ్రేళ్ల గుర్తులు తెప్పించావు కాబోలేవీ!" అనుచు వెనుకకుఁ దిరిగెను.

"అవును. ఇదివరకే తెప్పించాను. ఇవిగో! యీగుర్తుతో పోల్చి చూచాను. నామట్టుకీ రెండింటి కేమీ భేదం కనబడ్డంలేదు. నీవుకూడ చక్కగా చూడవచ్చు"నను అనుచు అదివరకే మైనపు దిమ్మపై ప్రభాకరరావుచేఁ దీయించి తెచ్చిన గుర్తులను విశ్వనాథమున కందిచ్చి ఆనందరావు నారాయణదాసుతో నేమియో సంభాషణ కారంభించెను.

విశ్వనాథ మానందరావిచ్చిన గుర్తుల నొకచేతఁబట్టుకొని రెండవచేతితో సూక్ష్మ దర్శినిఁబట్టి గోడపైనున్న రక్తపు గుర్తు నొకసారియు చేతిలోనున్న మైనపు దిమ్మపై ని గుర్తు నొకతరియు పరీక్షించుచుండెను.

నారాయణదాసును ఆనందరావును విశ్వనాథముచేయుచున్న పని గనిపెట్టుచు రెప్పవాల్చక చూచుచుండిరి. రెండు నిముసములయిన పిదప ఆనందరావు నవ్వుచూ—

"విశ్వనాథం! రెండురకముల వ్రేళ్ళగుర్తు లెప్పుడూ ఒక్కమోస్తరుగా వుండవని నీకు తెలియదా!" అనెను.

విశ్వనాథ మాప్రశ్నకు తాఁజేయుచున్నపని విడువకయే "ఉంటే వుండవచ్చును" అనెను.

ఆమాటల కానందరా వించుక కోపముతో —

"విశ్వనాథం! నీవేమనుకొన్నావ నే! కాని యీగుర్తు ప్రభాకరరావుది కాదని యెవ్వరూ చెప్పజాలర"నెను.

"అవును. యీగుర్తుకీ ప్రభాకరరా వెడమచేతి బొటన వేలి గుర్తుకీ యేమీా భేదంలేదు" అనుచు విశ్వనాథము మరల మరల సూక్ష్మదర్శికతో గుర్తులను చూడఁదొడఁగెను.

పదినిముసము లెల్లెడ నిశ్శబ్దము వహించెను. ఎవరి నోటనుండియు నెట్టివాక్యమును వెలువడలేదు. ఆనందరా వానందాతిశయమున నుప్పొంగుచు జేబునుండి సిగరెట్లపెట్టెనుఁ దీసి నారాయణదాసు కొకటందించి తానొకటి నోటనుంచి యింకొక సిగరెట్టును విశ్వనాథమున కీయఁబోయి దీర్ఘాలోచనా

నిమగ్నుఁడై యున్న విశ్వనాథ మద్దాని నంగీకరించునో లేదో యని యించుక సంశయించుచుండ—

చిరునగవుతో విశ్వనాథ మొకచో చేతనున్న సూక్ష్మ దర్శికనుంచి సంతోషచిహ్నముద్రితంబగు వదనవిలాసముతో ఆనందరావు తట్టునకుఁ దిరిగి—"తేవోయి! సిగరెట్" అనుచు మిత్రుని చేతినుండి సిగరెట్టును నూడబెరికి నారాయణ దానందిచ్చు నిప్పుపెట్టెతో సిగరెట్టును ముట్టించుచు—

"ఆనందరావ్! ఈగుర్తు విషయంలో నాకు మహాశ్చర్యమైన సంగతొకటి తోస్తూవుంది. అదేమిటంటే— శవాన్ని కాల్చినతర్వాత ప్రభాకరరావింటికి పారిపోతూ తొందరగా యిక్కడున్న కోటునుఁ దీసుకొన్నాడనీ అప్పుడు రక్తముచే తడిసివున్న చేతివేలిగుర్తు యిక్కడ పడివుంటుందనీ కదా నీ వంటున్నావు? తొందరగా కోటును తీసికొన్నప్పు డింత స్పష్టంగా గుర్తెలాపడిందో నాకేం తెలియకుండా వుంది. అదిగాక యీగుర్తు కోరి వేసినట్లుంది కాని తొందరలో పొరబాటున పడినట్లుగాలేదు. ఎవరేమిటి! యీగుర్తు కనిపెట్టినవారు?" అని నోటనుండి పొగను విసురుగా నూదుచుఁ బల్కెను.

"చక్రపాణి నౌఖరు అప్పలస్వామి, కాపలావున్న కానిస్టేబిలు"

"ఎవడా కానిస్టేబిలు?"

"వీడే!" అని దగ్గరనేయున్న రక్షకభటునిఁజూపించి "హత్య జరిగిన దగ్గరనుంచీ వీడే యిక్కడున్నాడు. చాల జాగ్రత్తైన మనిషి" అనెను ఆనందరావు.

"ఏకేకాని పోలీసువాళ్లు నిన్నెందుకీగుర్తు చూడలేక పోయారు? అని" విశ్వనాధము మొగము చిట్లించుచు నడిగెను.

"దానికేం! తొందఱలో పొరబాటుపడి వుంటారు. అదిగాక ఏదో చూచాం అంటే చూచాం అని కాని చక్రపాణిని చంపినగది, కాల్చినస్థలం, చుట్టుపట్లనున్న చోట్లు, తప్ప ప్రతిచోటూ బాగాకనిపెట్టి చూడలేదు. పోనీ! పోలీసు వాళ్ళమాటెందుకు; నీతలమీద ఎన్ని వెంట్రుకలున్నాయో అన్ని కేసులలో పనిచేసి జయంపొందిన నీవు నిన్న యీ యిల్లంతా గాలించావు కదా నీవెందుకు కనిపెట్టలేకపోయావు!" అని సబ్ యినస్పెక్టరించుక కోపముగాను, పరిహాసముగానుఁ బల్కెను.

ఆనందరావు పల్కులకు విశ్వనాధము నవ్వుచు — "అడగవలసిన మాటడిగినావోయి! నేను నిన్న యీ యిల్లంతా పరీక్షించినమాట నిజం. నేను చేసిన పరిశోధన ఎలావుంటుందో నీకు వేరే చెప్పనక్కరలేదుకదా! ఈ యిల్లంతా బాగా చూచాను. దానివలన యిప్పుడు చెప్పవలసిన దేమిటంటే ఈ గుర్తిక్కడ నిన్న లేదు. లేదు. ముమ్మాటికి లేదని చెప్పగలను." అని విశ్వనాధము తల నాడించుచు గంభీర స్వరమునఁ బల్కెను.

"ఏమిటీ!" అనుచు ఆనందరావు ఆశ్చర్యముగఁ జూచుచు "ఈగుర్తు నిన్ననిక్కడలేదూ! ఈవేళుందా? అసందర్భం! నీవన్నది సరిగాలేదు. గుర్తు ప్రభాకరరావుదే అని నీవొప్పుకుంటున్నావుగదా! ప్రభాకరరావిప్పుడకేస్టులో వున్నాడు. అలాంటప్పుడు అతని వేలిగుర్తు నిన్నక్కడలేనిది యీవేళేలావస్తుంది. విశ్వనాధం! నీవిలా అసందర్భంగా వాదిస్తావని నేనెప్పుడూ అనుకోలేదుసుమా?" అనెను.

"నిన్నలేనిగుర్తు యీవేళెలా వచ్చిందనే నేను మహా ఆశ్చర్యం పడుతున్నాను. లేకపోతే నీపాటి ఆలోచనలేకుండా నేనసందర్భంగా మాట్లాడలేద"ని విశ్వనాధమించుక కఠిన స్వరమున నుడివెను.

విశ్వనాధము పల్కులు రోషముగా నుండుటచే ఆనందరావు మోముజేవురింప ధీరస్వరమున యిట్లుబల్కెను.

"విశ్వనాధం! నేను మహా పట్టుదలగల మనిషినని నీవెరుగుదువుకదా. నీవీకేసులో యింకాపనిచేస్తే చేయి కాని ఏమీలాభం వుండదు. నీ వెంత చెప్పినా నా అభిప్రాయం మాత్రం మార్చుకోలేను. నాకుకొంచం పనుంది. వెళ్ళొస్తాను. నీవేమైన నాతో మాట్లాడవలసిన పనుంటే స్టేషనులోనే వుంటాను. కబురంప"నుచు యిరువురు రక్షకభటులు చేతులు జోడించుకొనుచు విధేయతతో వెంబడింప సబ్ యినస్పెక్టరు నిష్క్రమించెను.

గదిలోనిగోడల కందముగా నలంకరించిన నయనా నందకరములగు రవివర్మాచిత్రములను విచిత్రముతోఁ జూచు చున్న నారాయణదాసును ఆనందరావు వెడలిపోయినతర్వాత విశ్వనాధము మెల్లఁగాదట్టుచు "ఏమిటోయి! దాసూ! మహా జోరుగా చూసేస్తున్నావ్! ఇలాచూడు!" అనుచు గుమ్మము వరకుఁ దోడ్కొనివచ్చి—

"దాసూ! ఆనందరావుకి కోపమువచ్చినట్లుందోయి! మహావిసురుగా వెళ్ళేడు స్టేషనికి, దానికేంగాని ప్రభాకరరావుని రక్షించడానికి కొంచం ఆశమాత్ర ముందిసుమా!" అనెను.

నారాయణదాసా మాటలకు మొగము చీదరించు కొనుచు— "ఇంకా ఆశంటూ పట్టుకొన్నావేమిటోయి! నీ మాటలు చూస్తూవుంటే నీకు మతి స్థిరంగాలేనట్టుంది! పదా! పోదాం! రాత్రిబండిలో! యింటికి!" అనెను.

"ఇంటికిపోతే ఏడిచినట్టులే వుంటుంది! పోసీగాని చూచా! దాసూ! నామాటవిను! ఈగుర్తుందే నిన్ననిక్కడ లేదండానికేమీ సందేహంలేదు. అందుచేత యీకేసు చిన్న తమాషాపైని ఆధారపడివుంది. నేనిప్పుడేవస్తాను నీవిక్కడే కూర్చో!" అనుచు విశ్వనాధము చక చక మేడమెట్ల నెక్క నారంభించెను.

చక్రపాణి నౌఖరు అప్పలస్వామి కండ్లొత్తిజేయుచు, చుర చుర విశ్వనాధము చర్యఁగని పెట్టుచుండెను. నారాయణ దాసు యధారీతిని చిత్రపట పరిశీలనకుఁ గడంగెను.

కాపలా గాయుచున్న రక్షకభటుఁడు నోటిలో నేమియో గొణుగుకొనుచు నేల చతికిలఁబడెను.

విశ్వనాథము మొదటి యంతస్థుఁదాటి రెండవ యంతస్థునకుపోయెను. అచ్చటయిదునిముసములుండి మూడవ యంతస్థునకుఁ బోయెను. రెండు మూడు నిముసములలోనే సంతోషాతిశయమున మోమువికసింప ఉత్సాహపూరితుఁడై వెంటనే మెట్లనుదిగి క్రింది గదిలోనికివచ్చి "దాసూ! రావోయి! చాలసేపైమయింది. ఆనందరావుతో తొందరగా మాట్లాడవలసిన పనుంది. అలా వెళ్దాంరా!" అనుచు నారాయణదాసునుఁ దోడ్కొని పదడుగులువైచి మరల వెనుకకుఁదిరిగి కాపలా రక్షకభటుని బిలిచి "నీవు తిరిగి వచ్చే వరకూ చాలా జాగ్రత్తగా వుండాలి. అప్పలస్వామి నెక్కడికీ కదలనీయకు. నీకుఁదోడుగా మరిద్దరు కానిస్టేబిల్సు నిపుడే పంపిస్తాన"ని చెప్పి విసురుగా రక్షక భటాలయాభిముఖుడై చనెను.

విశ్వనాథము నారాయణదాసులు స్టేషనుఁ జేరుసరికి ఆనందరావొక గదిలో కుర్చీపైఁగూర్చొని యెదురుగానున్న బల్లపై కాగితములుంచుకొని యేమియో వ్రాసుకొనుచుండెను.

"ఏమిటోయి! వ్రాస్తున్నావ్! ఆనందరావ్! కొంపదీసి చార్జిషీటు కాదుగద!" అని విశ్వనాథ మానందరావు వీపుపై దట్టుచుఁ బల్కెను.

పరాకుగానున్న సబ్ యినస్పెక్టరు మిత్రుని పరామర్శ కులికిఁబడి వెనుకకుఁదిరిగి—

"అవును అదే ! విశ్వనాథం ! " అనెను.

"కేసింకా పూర్తి కాకుండానే వ్రాయడానికి నీకేమి అనుమానం లేక పోయిందా ! అని" విశ్వనాథము బల్లపైఁ గూర్చొనుచు నడిగెను.

ఆనందరావు విశ్వనాథ మసాధ్యుఁడని బాగుగా నెరుఁగును. ఏదో హడావిడి మళ్ళీ తెచ్చిపెట్టా డనుకొనుచూ వ్రాయుచున్న కాగితమట్లేయుంచి ఆశ్చర్యముతో—"ఏమిటీ? విశ్వనాథం!" అనెను.

"ముఖ్యమైన పరిశోధన నీవు చేయ లేదు."

"అలాగా! నేనింకా చేయవలసినపని మిగలలే దే అనుకొంటున్నాను. పోనీ నీవు కనిపెట్టేవా?"

"అవును! ఆలాగే అనుకొంటున్నాను."

"అదేమిటో చెప్పుదూ! చూదాం!"

"సరే చెప్తాను కాని ఇపుడు నీదగ్గఱ ఎంతమంది కానిస్టేబిల్సున్నారు?"

"ప్రస్తుతం ముగ్గురేవున్నారు. ఇంకా అవసరముందా?"

"అక్కరలేదు చాలును. కాని వీళ్ళుముగ్గురు బాగా అరవగలరా?"

"ఓ ! నీయిష్టం వచ్చినట్లుగా. కాని వాళ్ళరవడం ఎందుకు?"

"అలాంటివాళ్ళే నాకు కావాలి. వాళ్లని పిలిపించు వేగిరం" అని విశ్వనాథ మాబల్లపై మేనువాల్చుచు ననెను.

ఐదునిముసము లగుసరికి మువ్వురు రక్షక భటులు విశ్వనాథమునకును సబ్ యిన స్పెక్టరునకును సవినయముగా వందనము లిడుచు గదిఁబ్రవేశించిరి.

విశ్వనాథము రక్షకభటులు చేయు వందనము లందు కొనుచు— "మీరీ స్టేషనుకవతలనున్న గడ్డిని మోపులుగా కట్టించి చక్రపాణియింటికి వెళ్ళండి. మేమిప్పుడే వస్తాం" అని "ఆనందరావు! రావోయి! మనంకూడా వెళ్దాం" అనుచు లేచెను.

ఆనందరావును గోడకుఁ దగిలించియున్న కోటును భుజముపైఁ బడవేసుకొని విశ్వనాథముతోఁ బయలుదేరెను.

అట్లు విశ్వనాథము ఆనందరావును నారాయణదాసునుఁ దోడ్కొని చక్రపాణి యింటికిఁబోయి రక్షక భటులతో "మీరు మేడ పై అంతస్థునకుపొండు! మేముకూడ" అను చుండగనే చక్రపాణి నౌఖరు అప్పలస్వామి విశ్వనాథముపై కోపదృష్టులఁ బఱపి— "అయ్యా! ఇంటినిండ విలువగల వస్తువులున్నాయి. అందరూ జోరుగా తిరిగేస్తున్నారు. జాగ్రత్తగా చూడండ" నను.

విశ్వనాథమా మాటలకు నవ్వుచూ—

"మరేం ఫరవాలేదు! మేమావస్తువులు దొంగిలించడానికి వెళ్ళడంలేదు." అనుచు— "రావోయి! ఆనందరావ్! మనం వచ్చినపని చూదాం! దాసూ! జేబులో

అగ్గిపెట్టి వుందా ?" అనుచు నారాయణదాసును ఆనందరావునుఁ దోడ్కొని మేడపైకిఁ బోవఁదొడంగెను.

అప్పుడు నిక్కముగ విశ్వనాధనొక మహేంద్రజాలి కునివలెఁ గాన్పించుచుండెను. విశ్వనాధము చేయుచున్న పని కానందరావెంతయు కినియుచున్ననుఁ బైకి గంభీరముగ నుండెను. నారాయణదాసిదంతయు జూచి లోలోన నవ్వు కొనుచుండెను. మేడపై యంతస్థున కందరును జేరిన వెంటనే ఒక రక్షకభటునిఁ బిలిచి—

"నీవుపోయి బిందెడు నీళ్ళుఁ దీసుకొనిరా !" అనెను. విశ్వనాధం, ఇదంతయుఁ జూచి సబ్ యినస్పెక్టరు సహింపఁ జాలక గంభీరస్వరముతో— "తమాషా చేస్తున్నావేమిటి? విశ్వనాధం ! నీవు కనిపెట్టిన రహస్యమేమిటో చెప్పకుండా యీ అనవసర గందరగోళమంతా ఏమిట" నెను.

విశ్వనాధము నవ్వుచూ— "ఆగవోయి ! ఆనంద రావ్ ! ఆగవోయి ! నేనెప్పుడూ అనవసరమైనపని చెయ్యడం నీవెరుగుదువా ? పదినిమిషాలుంటే చూపిస్తాను. తమాషా ఏమిటో ?" అని విశ్వనాధము తలనాడించుచుఁ బల్కెను.

నీళ్ళకైఁ బంపబడిన రక్షకభటుఁ డొకబిందెతో నిండుగా నీళ్ళనుఁ దెచ్చి యొకచో నుంచెను. అపుడు విశ్వనాధము నారాయణదాసునుఁ జూచి "దాసూ ! ఇపుడన్నీ సిద్ధంగా వున్నాయి! అగ్గిపుల్ల వెలిగించి యీగడ్డిముట్టించు!" అని రక్షక భటులుఁ దెచ్చిన గడ్డినిఁజూపి "ఆనందరావ్ ! ఇపుడు నీ నేర

స్తుని చూపిస్తాను! అగ్గిముట్టుకోవడంతోనే నేను అగ్గి! అని పెద్ద కేకలు వేస్తాను. నాతోగూడ మీరును అగ్గి!! అగ్గి!! అని గగ్గోలు పెట్టాలి. తెలిసిందా" అని యనుచుండగనే నారాయణదాసు గడ్డికి నిప్పంటించెను. వెంటనే దట్టమగు పొగతో పెద్ద పెద్ద మంటలు మేడంతయు నావరించెను. "మేడంటుకొంటుందా! ఏమిటి? విశ్వనాథం! యేమిది. యిలాంటిపని చేసేవు!" అని ఆనందరావనుచుండగనే "అగ్గి! అగ్గి!! అగ్గి!!!" అని విశ్వనాథము గట్టిగా నరచెను. వెంటనే అందరునుకలసి అగ్గి!!! అను బొబ్బలుపెట్టిరి. మరల "అగ్గి!!! అగ్గి!!!" అని కేకలువేసెను విశ్వనాథం. తోడనే మేడంతయు ప్రతిధ్వనించునట్లు 'అగ్గి!!' యను రొదలు బయల్వెడలెను.

ఇంకొకసారి "అగ్గి!!! అగ్గి!!! అగ్గి!!!" అను ధ్వనులు చేయబడెను. ఉత్తర క్షణమునందే యొక ఆశ్చర్యకరమగు వింతఁ జరిగెను. ఏమది? విశ్వనాథాదులు నిలుచునియున్న యంతస్థునందొకమూలనుండి— "బర్" మని చప్పుడుతో నొక గుప్తద్వారము తెరువఁబడుటయు "ఆ!!! ఆ!!! ఏమిటి" అనుచు వెర్రిచూపులతో కాళ్ళు తడఁబడ నొకపురుషుఁడు పరుగెత్తుకొని మంటలవద్దకు వచ్చుటయుఁ జరిగెను.

"బలే! బలే! క్యాపిటల్!" అని విశ్వనాథము సంతోషముఁ బట్టఁజాలక యొక్కరుపరచి నీళ్ళబిందెపోసేయి! దానూ! మంటలమీాద" అనెను.

వెంటనే మంట లార్పఁబడెను.

## ఐదవ పరిచ్ఛేదము.



"ఆనందరావ్ ! ఎవడిని చంపేడని యేమీ యెరుగని అమాయకుండైన ప్రభాకరరావు నరెస్టుచేసి ఎన్నో యిబ్బందులుపెట్టి సులభంగా దొంగ దొరికాడని యెగిరెగిరి పడుతున్నావో, ఎవడి చావుకోసం సత్యవాదియగు ఒకయువకుని నిష్కారణంగా ఉరితీసేద్దామని నిశ్చయించుకొన్నావో, తాను చచ్చిపోయినట్టుగా ఎన్నెన్నో జిత్తులు పన్ని లోకానంతటిని నమ్మించి తన గర్భశత్రువగు ప్రభాకరరావునుచేరదీసి చివరకి వాడికొంపదీసి పాతపగ సాధించడాని కెత్నించాడో, వాడు ! ఆచక్రపాణి ! ఆదుర్మార్గుడు ! వీడే సుమా !" అనుచు గుప్తద్వారమునుండి పరిగెత్తుకొనివచ్చి విశ్వనాథాదులం జూచి శిలాప్రతిమవలె తెల్లంబోయి అట్లే నిలిచియున్న వ్యక్తినిచూపుచు విశ్వనాధ మానందరావు భుజముపైం జేయినిడి నుడివెను.

ఆనందరావు నారాయణదాసు రక్షకభటులును గుప్తద్వారమునుండి వెలువడి వచ్చిన వ్యక్తినిఁజూచియే నిశ్చేష్ట పాటునంది యుండిరి. పిమ్మట యావచ్చిన యాతండు చక్రపాణియే యని విశ్వనాధము పల్కుసరికి మరియు నాశ్చర్యచేతస్కులై నోటమాటలేక చేష్టలుడిగి కొయ్యలవలె నైపోయిరి. "ఏమిటి ! ఆశ్చర్యం ! ఇదంతా మహా గారడీలాగుంది !!! నువ్వేనా చక్రపాణివి !!! మొన్నటినుంచీ ఎక్క-

డున్నావునువ్వు !!! అనుచు ఆనందరావు మహాశ్చర్యము వెలి బుచ్చుచు కండ్లెఱ్ఱఁజేసి క్రోధరస ముట్టిపడ చక్రపాణిని బ్రశ్నించెను.

చైతన్యరహితుఁడై పిండిబొమ్మవలె నిలుచునియున్న చక్రపాణి సబ్ యినస్పెక్టరు గద్దింపు పల్కుల కులికిపడి సర్దు కొనుచు—

"ఏమిటిది ! నేను నాయింట్లోనే వున్నాను. మీరు మీరెవరో పోలీసువారిలాగున్నారేమిటి? ఎందుకిలావచ్చారు ? ఈగందరగోళమంతా ఏమిటి ?" అనుచు చక్రపాణి మాటలు తడఁబడ తొందర తొందఱగాఁ బ్రశ్నపైఁ బ్రశ్న వేయుచు వింతగాఁ జూడఁదొడఁగెను.

చక్రపాణిప్రశ్నల కానందరావు పట్టరాని కోపముతో గర్జించుచు— ఏమంటున్నావ్ ! గందరగోళమేమిటనా ? ఈ గందరగోళమే లేకపోతే నీవనుకొన్నట్లుగా ప్రభాకరరావు మీద కసి తీర్చుకొనేవుందువు. నీ దురాలోచనచేత మంద బుద్ధినగు నన్ను మాయచేసినావు కాని ఈ మహానుభావుఁడు లేకపోతే నిష్కారణంగా అమాయకుఁడైన ప్రభాకరరావుని ఉరితీసేదుంగదా ?" అనెను.

క్రూరస్వభావుఁడగు చక్రపాణి గుటకలు మ్రింగుచు— "మీమాటలు నాకేం అర్థం కావడంలేదు. ప్రభాకరరావు పైని నేను కసిఁదీర్చుకోవడం ఏమిటి ? నేనాతని కన్నకొడు క్కంటే ఎక్కువగా చూచుకొంటూవుంటే— మొన్నే నా

ఆ స్వంతా అతనికి వ్రాసిచ్చేశాను కూడాను. మీా మాటలు మీాచర్యలు చూస్తూవుంటే చాలా తమాషాగా వున్నాయే! అసలు మీావుద్దేశమేమిటో తెలియకుండావుంది?" అని యింకేమియో చక్రపాణి పల్కుచుండగనే ఆనందరావు గట్టిగాఁ గసరుచు—

"మావుద్దేశం నీకెలా తెలుస్తుంది? నీకిదంతా తమాషాగా కనిపిస్తున్నదా? కొంచెంసేపాగు! ఆ తమాషా ఏమిటో చూపిస్తా"నని రక్షకభటులతో "మీారితనిఁ దీసుకొని పోయి మేము వచ్చేవరకూ క్రింద కనిపెట్టుకొని ఉండండ"ని ఆజ్ఞాపించెను. యజమానుని పల్కులు ముగియకుండగనే రక్షకభటులు చక్రపాణినిఁ బట్టుకొని బలవంతముగఁ దీసుకొని పోవనమకట్టిరి.

అపుడు చక్రపాణి ఆనందరావును విశ్వనాథమును చురచురఁ జూచుచు కోపముతో "ఏమిటీ! అన్యాయం! మీారంతా పోలీసువాళ్ళేనా? లేకపోతే పోలీసువేషం వేసుకొన్న బందిపోటుదొంగలా?" అని యనుచుండగనే—

"ఛీ! ఛీ! నోరుమూయి! నోటికివచ్చినట్లు పేలితే చూడు! జాగ్రత!!!" అని చేతిలోనున్న తోలుకమిచీ చూపించుచు— "మీారితని గెంటుకొని పొండ"ని రక్షకభటులను హెచ్చరించెను. వారును ఉత్సాహముతో యజమానుని యూజ్ఞానుసారముగ చక్రపాణిని బలవంతముగ గెంటుకొనుచు క్రిందకుఁ దీసుకొనిపోయిరి.

నారాయణదాసింకను వింతగా విశ్వనాథమునఁ జూచు చునే యుండెను.

చక్రపాణినిఁ దీసుకొని పోయిన తర్వాత ఆనందరావు విశ్వనాథము కంఠమును తమ వామహస్తమునఁ జుట్టి "అద్భుతమైన పనిచేసేవోయి! విశ్వనాథం! ఏమంటావ్! దాసూ!" అనెను.

సబ్ యినస్పెక్టరు ప్రశ్నకు నారాయణదాసు నవ్వుచూ "ఏమంటాను! ఇదంతా మహేంద్రజాలం లాగుందంటాను!" అనుచు విశ్వనాథము చేయిఁబట్టుకొని యూపుచూ "విశ్వనాథం! నీవిదివరకు డిటెక్టుచేసిన కేసులన్నీ ఒకెత్తు; ఇది ఒకెత్తుసుమా! నేనెప్పుడూ యిలాంటి అద్భుతమైన పరిశోధన చూడలేదోయి! బావా! అన్నింటికేంగాని నిర్దోషి అయిన ప్రభాకరరావుని రక్షించి మాట నిలఁబెట్టుకొన్నావోయి! అబ్బ! సీతస్వాగొయ్యా! ఎంతపనిచేసేవ్! నువ్వింతవాఁడవని యిప్పుడు తెలిసింది సుమా! నాకౌ" నెను.

విశ్వనాథము చిరునగవుతో ఆనందరావు భుజముపైఁ జేయివేసి——

"ఆనందరావ్! అన్నిటికేంగాని నీవు ముందు వ్రాసే రిపోర్టులో నాపేరెక్కడా కనిపించగూడదు. నీవే చక్రపాణి కుట్ర బయలుదీసినట్లు వ్రాయాలి. తెలిసిందా!" అనెను.

"అదేమిటోయి! అసందర్భం! నీపేరెందు కుండగూడదు? మనం వద్దన్నా పత్రికాధిపతులు మానంతారా?

రేపుదయం పేపర్లో చూడు! నీడితెల్కను మీదెలాంటి ఆర్టికల్సు బయలుదేరతాయో" అని ఆనందరావు నవ్వుచుఁ బల్కెను.

"అలాగా! నేనెందుకలా అన్నానంటే నీవే యీ కేసు పట్టుకొన్నావని అంటే నీకు ప్రమోషనైనా వుంటుందనుకున్నాను".

"సరే! ఇదా! నీఆలోచన! నా ప్రమోషనుకోసమా అబద్ధాలన్నీ కల్పించి వ్రాయమంటావ్! నీ దయుండాలికాని నాకొద్దుబాబూ! అలాంటి ప్రమోషను" అని ఆనందరావు పకపకనవ్వుచుఁ బల్కెను.

విశ్వనాధమును నవ్వుచు "సరే! దానికేం గాని యిన్నాళ్లు యీ ఎలకెక్కడ దాగున్నాడో చూదాంరండ"ని ఆనందరావును, నారాయణదాసును దోడ్కొని చక్రిపాణి వెలువడివచ్చిన గుప్తద్వారమువద్దకుఁ జనెను. అది గజము పొడుగును, గజము వెడల్పును, మూడుగజముల ఎత్తును గలిగి యొక పెట్టెవలె గోడలో నిమిడియున్నగది. ఆగదితలుపులు మూసినట్లైన బయటనున్న వారెంత ప్రయత్నించినను, తద్వారమించుకైనను గనిపెట్టఁజాలరు. అనుమానమైనఁ బడుటకు వీలులేదు.

విశ్వనాధ మాగదిలోనికిఁ బోయి—

"చూచారా! ఎలాంటి స్థలంలో దాగున్నాడో చక్రిపాణి! ఇక్కడ మూడు నాల్గు రోజులు దాగుందామని

అనుకొన్నాడు. అందుకే యీపళ్ళు, రొట్టెలు తినడానికి దాచాడు. చదువుకోడానికి పుస్తకాలుకూడా వుంచాడు; పెద్దశిల్పకారుడుగదా! అందుచేత స్వంతంగా ఎవళకీ కనిపెట్ట డాని కసాధ్యంగా కట్టివుంటాడు. ఈసంగతా వెధవ నౌఖరు అప్పలస్వామికి తెలుసును" అని యింకేమియో చెప్పుచుండ గనే—

"విశ్వనాథం! ఈవిషయంలో నాకాశ్చర్యంగా వున్న సంగతులు చాలావున్నాయి! కాని ముందీ రహస్య స్థలం యిక్కడున్నట్టు నీవెలా కనిపెట్టేవో చెప్పు. ఆనందరావుకు కొద్దియో గొప్పయో తెలుస్తుంది కాని నాకెంతాలోచించినా అగాధంగా వుంద"ని నారాయణ దాసనెను.

నారాయణదాసు ప్రశ్నకు విశ్వనాథ మించుకైనను నాలోచింపకయే "నేను మొట్టమొదటనుంచీ చక్రపాణి హత్యలో అనుమానం పడుతూనే వున్నాను. ఎక్కడో యీ జిత్తులమారి ముండాకొడుకుంటాడని తెలుసును. తర్వాత వేలి గుర్తు నా అనుమానం మరీ ధృవపరిచింది. వెంటనే దెయ్యం లాగున్న యీ యిల్లంతా ఒకమారు వెతికితే లాభం వుంటుం దనుకొన్నాను. ముందు క్రిందగదులన్నీ పరీక్షించాను. తర్వాత మేడమీదకొచ్చి కింద రెండంతస్థులూ చూచాను. అక్కడ నాకేమీ విశేషం కనిపించలేదు. యీఅంతస్థులో యీ చోటుందే నాకు చాలాఅనుమానం కలిగింది. ఎంచాతంటావంటే: మూడంతస్థులలోను ఎడమవైపూ కుడివైపూ గోడకంటుకొంటూ మేడపొడుగునా యీబీరువాలు చూచారా?" అనుచు

గోడలవైపు చేతితో జూపించెను. ప్రతియంతస్థున కిరువైపు లను మూడడుగులు యెత్తును, మూడడుగులు వెడల్పును గలిగి మేడపొడుగున నొకబీరువా యమర్చఁబడియున్నది. విశ్వనాథము చెప్పఁదొడఁగెను. "ఈబీరువాలో అనేక రక ములైన వస్తువులుంచుకొనవచ్చును. అందులోను చక్రపాణి పెద్దపనివాడు గనుక ఉపయోగించు పనిముట్లు వేనకు వేలుగ బీరువాలనిండా నింపేడు, చూచారా? ఇంక నేచెప్పబోయే దేమిటంటే: కింద రెండంతస్థులలోను యీా కొసనుంచి ఆకొస వరకూ బీరువా సరీగా అమర్చాడు. మరి యీాఅంతస్థులోనో ఎడమవైపు మామూలుగానే యీాకొసనుంచి ఆకొసదాకా బీరువావుంది. కుడివైపు చూడండి! ఆకొసనుండి యీాచివర దాకా బీరువా అమురుస్తూ యీాకొసను మూడడుగులస్థలం ఖాళీగావుంచాడు. అందుచేత యిదేదో రహస్యస్థలం అయి వుంటుందని నిశ్చయించాను. మనం అనుకొన్నట్లుగా నిజంగా యిదే చక్రపాణి దాగినస్థలం అయింది."

ఉపాధ్యాయుడు పాఠములను బోధించునపుడు శిష్యు లేరీతిగ శ్రద్ధవహించి వినుచుందురో ఆరీతిగనే ఆనందరావు, నారాయణదాసులు విశ్వనాథము చెప్పునదెల్లను వినుచుండిరి.

విశ్వనాథము మరలఁ జెప్పనారంభించెను.

ఈస్థలం బాగాపరీక్షించాను కాని ఎక్కడా దారివున్న ట్టుగాని, తలుపులున్నట్టుగాని ఆనవాలు కనపడలేదు. అంత తమాషాగా కట్టాడీగది. అంచాత, "అగ్గి! అను కేకలువేస్తే కాని వీడుబయటికిరాడనే ఆయెత్తువేత్తేను. తెలిసిందా"అనెను.

విశ్వనాథము తాను గావించిన పరిశోధనా విధానము దెల్పుచున్నంతసేపును సిగ్గు సంతోష మొక్కసారిగఁ బెనగొన ఆనందరావక్లే నిలువఁబడి యుండెను. నారాయణదాసు విశ్వనాథము చేయిపట్టుకొని నవ్వుచూ—

"బావా! నీవిపుడు చెప్పిందంతా నాకు బోధపడింది కాని నిన్నొఁక్కటడగవలసుంది. అదేమిటంటే! మొదట చక్రపాణి చావలేదని నీవెలా నిర్ధారణచేసుకొన్నావు?" అనెను.

నారాయణదాసు పల్కులకు విశ్వనాథము చిరునగవుతో—

"దాసూ! ఇది చాల తేలికప్రశ్న—ఏమంటే ప్రభాకరరావు జరిగినసంగతంతా చెప్పినదగ్గఱనుంచీ చక్రపాణి హత్యావిషయంలో నాకు చాలా అనుమానంగానే వుండేది. మొదట రోజున నేను ముందుగా షాంబజారుకు పోతానని చెప్పినపుడు నీవు "ఈహత్యజరిగిన చక్రపాణియింటికి మానేసి షాంబజారో అని పట్టుకున్నావేమిటి?" అని కాబోలన్నావు. ఆనందరావు కూడ నీమోస్తరుగానే "షాఁబజారుకా?" అని ఆశ్చర్య పడ్డాడు జ్ఞాపకంవుందా? ఎందుకు నేను షాంబజారుకి ముందుగా వెళ్ళేనో యిప్పుడైనా తెలిసిందా? అక్కడ చక్రపాణికి ప్రభాకరరావుకి ఎలాంటి సంబంధముందో ప్రభాకరరావుకి చక్రపాణి ఆస్తంతా వ్రాసియ్యడానికి కారణమేమైయుంటుందో కనుక్కోడానికే—

తర్వాత ముఖ్యంగా యీావేప్రలిగుర్తు నాఅనుమానం బలపరచింది. ఏమంటే నేను నిన్నిక్కడికి వచ్చినపుడీస్థలం

అంతా బాగా పరీక్షించాను. అపుడా గోడమీదా గుర్తులేదు. అది నాకు బాగా నమ్మకంవుంది. అంచాత గుర్తు రాత్రి వేసుంటాడని లేకపోతే నౌ ఖరు చేత వేయించుంటాడని తోచింది. ప్రభాకరరావు వ్రేలిగుర్తు పీడెలా వేయగలడంటా వేమో! అయితే విను? ప్రిభాకరరావు మొన్నటి రాత్రి చక్రిపాణింటికి వెళ్ళినప్పుడు కాగితాలన్నీ చూపించి కట్టగట్టి తర్వాత సావకాశంగా చూదామని ఆ కాగితాలు మీాద లక్క సీలు వేసి తనచేతి వ్రేలిముద్రి వేయించుకొని పెట్లో పడేశాడని ప్రిభాకరరా వన్నాడు. జ్ఞాపకం వుందా? ఆ కాగితాలు చక్రిపాణి పెట్లో లేవు. అంచాతనే మొన్న నీతో "కొన్ని కాగితాలు దొంగిలించారెవరో" అన్నాను. ఆ వ్రేలిగుర్తు సంగతి ముందుగా చక్రిపాణికి తోచలేదు. ఈ గదిలో దాగున్న తర్వాత అంటే నిన్న తెల్లవారునవ జ్ఞాపకం వచ్చి వుంటుంది. అదొక్కటే ప్రిభాకరరావు మీాద నేరం ధృవ పడ్డానికి చాలునని ఆలోచించాడు. రాత్రి పన్నాగం పన్ని వ్రేలిగుర్తు అంటింపించాడు. లక్కమీాదున్న శీలు గోడమీాదెలా వేసాడంటావంటే సీలు లక్కది గదా? అంచాత దానిమీాద ముద్రి యింకొకదానిమీాద వేయడం బహుసులభం. ఎలాగంటే శీలులో వున్న గీరులు సన్నని సూదితో లోతుచేసి కాగితంపైవున్న శీలు పైకూడదీసి రక్తంలో ముంచి సవ్యంగా గోడమీాద వేసాడు. వాడు వెయ్యకపోతే నౌకరుచేత వేయించాడు. ఇపుడు మనం చూదామంటే ఆశీలు యిక్కడే వుంటుంది చూడండ" నెను.

"అద్భుతం! విశ్వనాథం! అద్భుతం! నీవు చెప్పిన వన్నీ సరీగా వున్నాయి! కాని నాకింకొక్క సంశయం మాత్రముంది! అదేమిటంటే! చక్రిపాణి యీ చర్యకంతటకి కారణ మేమిటోకదా!" అనెను. యించుక సంశయముతో ఆనందరావు "సరి సరి. యిదా నీసంశయం! నాకీవిషయం బోధపరచడానికి చాల సులభం చెప్తాను విను—

ఇపుడు మనచేత పట్టుబడిన యీమనిషి ఒకప్పుడు ప్రిభాకరరావు తల్లిని ప్రేమించాడనీ కొన్ని కారణాలచేత చక్రిపాణి ఆమెను పెళ్ళాడడం తటస్థించలేదని తర్వాత చక్రిపాణి ప్రిభాకరరావు తల్లిని కొన్నాళ్ళవరకూ తనతో లేచి రమ్మని బలవంతి పెట్టేవాడని ఆమె కఠినంగా జవాబు చెప్పినదగ్గరనుంచీ ఆకుటుంబం మీాద పగ సాధించాలని కనిపెట్టుకొని వున్నాడనీ నిన్న నీతో చెప్పెను. జ్ఞాపకం వుందా? ఈ సందర్భాల చేత ప్రిభాకరరావు మీాద ఒక కన్ను వేసే వున్నాడు చక్రిపాణి! కొన్నాళ్లవరకూ వీడు చాలా పెద్దమనిషే కాని రెం డే ళ్ళ ను ం చి వీడికి రెండు దుర్బుద్ధులు పుట్టేయి! అదేమిటంటే తనపేరవున్న బ్యాంకు సొమ్ములో రంగనాధుడన్నా మారుపేరుతో చాలమట్టుకు చెక్కు మార్చుకొని అప్పులన్నీ ఎగవేసేదామని ఒకటి, యీ మధ్య యిల్లుకూడా తాకట్టు పెట్టినట్లు భోగట్టా వచ్చింది కూడాను. ఇక రెండవదేమిటంటే తాను చచ్చినట్టు రుజువు చేస్తే అప్పులు పోవడమే కాకుండా తన విరోధి అయిన ప్రిభాకరరావుమీాద బైండవడానికి వీలుగా వుంటుందేమో

అనే తన అప్పుల ఆస్తంతా పాపము ! ప్రభాకరరావుకి వీలు వ్రాశాడు. తర్వాత తన్ను చంపినవాడు ప్రభాకరరావే అని రుజువు చేయడానికెలాంటి ఎత్తులు యెత్తేడో నీకు తెలుసును కదా ! ప్రభాకరరావుని ఉరి తీయించేదామనే ఎత్తులు వేశాడు, ఒక వేళ యేకారణము చేతనైనా తప్పిపోతే అప్పులైనా వాడి మీద పులుముదామనే అనుకొన్నాడు. పాపం ఎక్కడైనా కాస్తుందా ! వేలుముద్ర యీగదిలోనికి రాకముందు వేసేడంటే మనం కాదుగదా ! బ్రహ్మయినా వాడిని పట్టుకోవడం వుత్తమాట. ఎంత తెలివైనవాడైనా అన్యాయంకదా !" అనెను.

విశ్వనాథము చెప్పినదంతయు సాంతముగ నాకర్ణించి ఆనందరావమితానందముతో "నిజం— విశ్వనాథం! చక్రపాణెంతపనిచేసేడు ! కొంప ముంచాడు గదా ! పాపం, నిష్కారణముగా ప్రభాకరరావుని ఉరితీసేయిద్దును గదా ! విశ్వనాథం ! నీకు సాటయినవాడవు నీవే ! ఈప్రపంచకములో ఉన్న వాళ్ళెవళ్లూ నీకు సరిలేరు. అలాంటపుడు ఏమీ తెలియని నా మూర్ఖపు మాటలకు కోపగించుకోకుసుమా !" అని యింకేమియో బల్కుచుండగనే—

"దానికేంలే ! చక్రపాణితో రెండు మూడు మాట్లాడుదాం రా ! రావోయి దాసూ ! నిలుచునే నిద్రపోయేలాగున్నావుకదా!" అనుచు విశ్వనాథ మానందరావుపై నొక చేయియు నారాయణదాసుపై నొకచేయియు నుంచి మేడ క్రింది భాగమునకుఁ బోయెను.

క్రిందిభాగమున నున్న వసారాలో చక్రపాణి తెల్ల బోయిన మొగముతో చేయునదిలేక గుటకలు మ్రింగుచు కోపముచేతనో, భయముచేతనో గాని దేహమంతయు గంపింప రక్షకభటుల తోడను, అప్పలస్వామి తోడను, యేమియో మాట్లాడుచు—విశ్వనాథాదులంజూచి తటాలున లేచి నిలువఁ బడి యిట్లు నుడివెను—

"అయ్యా! ఇదేమీదురూహతో చేసినపనికాదు. నా కెవ్వరినీ కష్టపెడ్దామని ఉద్దేశం లేనేలేదు. ఊరికే తమాషాయే కాని మరేంకాదను" చుండగనె—

"ఛీ! ఛీ! నోరుముయ్యి! యింకా యేదో అన్నట్లు తమాషాయేకాని దురూహకాదని పెద్దమనిషిలాగ మాట్లాడ బోతావు!" అని కండ్లెఱ్ఱజేయుచు ఆనందరావు గర్జించెను.

ఆనందరావు కోపమునకు చక్రపాణి సమర్థనకు విశ్వ నాథము నవ్వుచూ చక్రపాణింజూచి—

"నీ బ్యాంకుసొమ్ము మారుపేరుతో మార్చుకోవడం చచ్చిపోయాడనుకోవలని యిన్నెత్తులెత్తి నేరమంతా నీకు లొంగని పార్వతమ్మమీద పగ సాధించుదామని ఆమె కొడుకైన ప్రభాకరరావుమీద మోపడానికి మాయచేసి ఆస్తంతా యిస్తానని యింటికి తీసుకొచ్చి చేతికర్రదాచి దాని నిండా రక్తం పులమడం, నీగదిలోనుంచి కర్రలగుట్టదాకా ఏదో యీడ్చి శవాన్ని యీడ్చినట్లుగా చేద్దామని కర్రల గుట్టలో నీకోటు పంట్లాం పడేసి నీశవాన్ని కాల్చినారనుకోవాలని అమాయకుఁడగు ఆప్రభాకరరావును నమ్మించి అతనిగొంతుక

కోయడానికి ఎన్నైనా ఎత్తులెత్తావు ! ఆఖరికి లక్ష్మీలు పెద్ద శిల్పివిగనుక తమాషాగా వూడదీసి గోడమీద ఏదో రక్తంలో ముంచి ముద్రవేయడం అబ్బ ! అబ్బ ! ఇదంతా తమాషాగా చేసిందే కాబోలేం ! దుర్మార్గుడా ! నిష్కారణంగా ప్రభాకర రావుని చంపించేదువుకదా !" అని పండ్లు పటపటఁ గొరికెను.

విశ్వనాథము పల్కులు ముగియుసరికి చక్రపాణి మొగము నెత్తురుచుక్కలేదు. నిశ్చేష్టుఁడయ్యెను. అయిదునిమిసము లట్లేయుండి పిమ్మట కోపావేశమున విశ్వనాథమును చురచురఁ జూచుచు——

"నీవెక్కడనుంచి దాపరించావు ! నాపాలిట యముడు లాగ ! నీవు లేకపోతే యిలాంటి చవటలు నా ప్లాను పాడు చేయగలరా ?" అని యానందరావునుఁ జూపి మరల విశ్వనాథముతో—— "ఛీ ! ఛీ ! ఎంతపని జరిగిపోయింది ! నీలాంటి వాళ్ళూల్లో ఉన్నారంటే యింకా కొంతకాలందాకా నాయెత్తుయెత్తకేపోదును. నా జేబులో సమయానికి రివాల్వరు లేకపోయింది గాని వంచేసుకుపోదునో నిన్ను ? ఎందుకూ ! ఇంతకీ నాకర్మం యిలాకాలింది ! నీలాంటివాని చేతులో పడిపోయాను. పోనీ యిప్పుడైనా మించిపోయిందిలేదు. నేనే బ్రతికుంటె యీాబుణ మెప్పుడైనా తీర్చుకుంటానులే ! తొందర పడ"కని గర్జించుచు——కండ్లనుండి నిప్పులు రాలునట్లుఁబల్కెను.

రక్షకభటులదివరకే జేతులకు గొలుసు లలంకరించిరి. కాని లేనట్లైన విశ్వనాథముపైఁబడి మ్రింగివేయవలెనన్నంత కోపము గలిగెను. పాపము ! మన చక్రపాణికి ! విశ్వనాథ

మూవల్కులకు మందస్మితుఁడై— "అవును! చక్రపాణీ! నీవన్నంతపని చేసేవాడవే! చెయ్యి మించిపోయింది పాపము! తెలివైనవాడివే. కాని, తొందఱపడ్డావు! ఏమంటావ్! ఎప్పుడైనా అన్యాయంకాస్తుందా?" అని సబ్ ఇనస్పెక్టరువైపుఁదిరిగి—

ఆనందరావ్! చాల్లైమైంది! మేం పోతాం. నీ దోహిని స్టేషనుకుతీసుకొనిపోవచ్చును! ఇటుచూడు! ఆ అప్పల స్వామికి కూడా యీకుట్రలో వంతుంది సుమా!" అనుచు చక్రపాణిసేవకునిఁ జూపించెను.

విశ్వనాథమన్నమాటల కప్పలస్వామి కుపితుఁడై నోటిలో నేమియో గొణుగుకొనఁ దొడఁగెను.

నారాయణదాసు నవ్వుచూ—

"రావోయి! విశ్వనాథం! ఆకలివేస్తోంది! ఆనంద రావ్! శలవు. చక్రపాణిగారూ! శలవనుచు— "నీకీ పేరెవరు పెట్టేరురా!" అనుచు విశ్వనాథముతో నిష్క్రమించెను.

---

## ఉపసంహారము.

నిర్దోషియగు ప్రభాకరరావును, తల్లియు, తండ్రియగు వేంకటపతియు నొక పళ్ళెరములో వెయ్యేన్నూట పదార్లు రూప్యములుఁ బోసికొని హారిశ్చంద్ర ముఖర్జీగారి బంగళాలో నొక గదియందుఁ గూర్చుని నారాయణదాసుతో సరస సల్లాపములాడుచున్న, విశ్వనాథ మెదుట నుంచి "స్వీకరింపుఁ"డనిరి.

విశ్వనాథము వారల కృతజ్ఞతకు మిక్కిలిగ ముద మందుచు—"అయ్యా! క్షమించండి! నేను డబ్బుకాశపడు

వాడనుగాను. ప్రభాకరరావుని రక్షించగల్గినాను గదా! అను సంతోషమే నాకెక్కువగా బహుమాన మిచ్చినట్లుంది!" అనుచుఁ దిరుగ పత్ర్రము వెంకటపతికిచ్చివేసెను. కాని ప్రభాకరరావు ప్రాణమిత్రుఁడగు దుర్గప్రసాద్ బలవంతముపై ధగధగ మెరయు నొక వజ్రపుపొడి యంగుళీయకము విశ్వనాథము వ్రేలి నలంకరింపకఁ దప్పదయ్యెను.

సాయంకాల మారుగంటలకే విశ్వనాథము మిత్రులందరివద్దను శలవుఁగైకొని స్వగ్రామమగు విశాఖపట్టణము పోవుటకు నిశ్చయించుకొని ఆనందరావు, ప్రభాకరరావు, దుర్గప్రసాద్, వెంకటపతి మున్నగువారితో "శలవు! శల" వని లేచెను. వారును "మేము కూడ తమతో స్టేషనువరకు వచ్చెద" మనిరి.

స్టేషనుకుఁ బోవుటకు విశ్వనాథము సిద్ధమై యింకను గూర్చొని యేమియో పరధ్యానముగ నాలోచించుచున్న నారాయణదాసుతో—"ఏమోయి! దాసూ! రావోయి! పోదాం" అనెను.

ఆమాటలకు నారాయణదాసు నవ్వుచూ— "రక్షించావు! నాయనా! యిన్నాళ్ళకు!" అనుచు రైలుసంచి కొండడిచేతికందిచ్చి తాను కోటును ధరించుచుఁ బల్కెను.

సమాప్తము.

---

# సరస్వతీ గ్రంథమాల.

కాకరపర్రు,
స్థాపితము 1923.

తణుకు తాలూకా,
పశ్చిమగోదావరి జిల్లా.

ఈ గ్రంథమాలయందు మూడుమాసముల కొకటి చొప్పున రసవంతమగు నవలలు, నాటకములు (చరిత్రాత్మక, అపరాధ రహస్య, పరిశోధక, సాంఘిక) ప్రచురింపబడును. భాషాభిమానులందరు, చందాదారులగగాని, పోషకవర్గములో గాని జేరి హెచ్చరింపగలందులకు ప్రార్థితులు.

సం॥ చందా రూ 2-8-0 ప్రవేశరుసుము 8 అణాలు

| | శాశ్వత | ప్రతి సం॥ |
|---|---|---|
| మహారాజ పోషకులు | రు 500 | రు 50-0-0 |
| రాజపోషకులు | రు 250 | రు 25-0-0 |
| పోషకులు | రు 125 | రు 12-8-0 |
| సహాయులు | రు 50 | రు 5-0-0 |
| చందాదారులు | రు 25 | రు 2-8-0 |

ఇదివరలో గ్రంథమాలలో బ్రచురింపబడి అమ్మకమునకు సిద్ధముగ నున్న గ్రంథములు సుమారు 30 గలవు. చందాదారులుగ జేరినవారికి వెలువడిన గ్రంథములు తగ్గింపు వెలకీయబడును. వలయువారు పుస్తకముల జాబితాకొరకు వెంటనే వ్రాయుడు.

# కవితా సమితి గ్రంథావళి.

---

(1) ప్రభవ (కావ్యసంపుటి) వెల 8 అణాలు.
శ్రీరంగం శ్రీనివాసరావు.

(2) నందకుమారవధ (చరిత్ర) వెల 8 అణాలు.
మొసలికంటి సంజీవరావు.

(3) ఉత్కలపతనము (నాటకము) వెల 12 అణాలు.
పురిపండా అప్పలస్వామి.

(4) కవితాసమితి వార్షికసంచిక వెల 1 రూపాయి.

(5) వైశాఖ (ద్వితీయవార్షిక సంచిక) వెల 1 రూపాయి.

కార్యదర్శి,

**కవితాసమితి,**

విశాఖపట్నం

---

# దేవుడి కోపం



చిప్పకుల ఆదినారాయణ